# …న కవితా వైభవం

ముక్కు తిమ్మనార్యు ముద్దుపలుకు లొలికే
పద్యాలకు ముచ్చటగొలిపే వ్యాఖ్యానం

వ్యాఖ్యాత :

## డా॥ బి.వి. కుటుంబరాయ శర్మ

ప్రచురణ :



రిజిష్టర్డు నెం. 1/64

**యువభారతి**
**సాహితీ సాంస్కృతిక సంస్థ**
**5 కింగ్స్‌వే, సికింద్రాబాదు-3**

# THIMMANA KAVITHA VAIBHAVAM

Selections from Nandi Thimmana's
Poetic Works with Commentary

By Dr. B. V. Kutumbaraya Sarma



యువభారతి

ప్రచురణ : 39
ప్రథమ ముద్రణ : ప్రతులు 3,200
21 [illegible], 1975

ముఖచిత్ర రచన :
శీలా వీర్రాజు

ముద్రణ :
నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు

ముఖచిత్ర ముద్రణ :
[illegible] ప్రింటర్స్, హైదరాబాదు

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003.

లేదా

యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

వెల : 2-00

PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS
WAS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA
AT CONCESSIONAL RATES

YUVABHARATHI IS GRATEFUL




# యువభారతి పరిచయము

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు, వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 38 ప్రచురణలను ప్రచురించి రెండు లక్షల ఇరువై ఐదువేలకు పైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించటానికి పూనుకొన్నది.

యువభారతి సాహితీమిత్ర పథకంలో లోగడ దాదాపు ఎనిమిది వేలమంది సభ్యులుగా ఉండేవారు, గత డిశంబర్ నుండి కొత్తరూపు దిద్దుకున్న ఈ ప్రణాళికలో ఇప్పటికి మూడువేల నాలుగువందలమందికి పైగా సాహితీమిత్రులుగా చేరారు. పాత సాహితీ మిత్రులు కూడా ఈ పథకంలో చేరి, రానున్న ఉగాదినాటికి ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్య సాధనలో తోడ్పడండి. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన శాశ్వత జీవిత పథకాలలో ఐదువందలకు పైగా భారతీమిత్రులుగా, యాభై మంది భారతీభూషణులుగా చేరారు.

ఉడుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు. వారి సౌహార్దం, భాషాప్రియత్వం-ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయనశీలతా సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని కోరుతూ—

21-12-1975

అధ్యక్షుడు



# మా మాట

నన్నయ భారత రచనతో ప్రారంభమైన తెలుగు కవితాస్రవంతి పదహారవ శతాబ్దారంభంలో విశాలమైన మహానదిగా ప్రవహించసాగింది. పురాణేతి హాసాలలోని కథలను యథాతథంగా తెలుగుచేసే పద్ధతికి కవులు స్వస్తిచెప్పి ప్రసిద్ధమైన ఒకేఒక్క కథను తీసికొని శృంగార వీరరసప్రధానంగా అష్టాదశవర్ణనా సముపేతంగా మంచి ప్రబంధమనే నూత్న కావ్యప్రక్రియను అవతరింప చేశారు. ఈ అవతరణతో ప్రజల దైనందిన జీవితంలోని కష్టసుఖాలనూ, సమకాలీన జీవిత వృత్తాలనూ వాచ్యంగానో వ్యంగ్యంగానో ఉట్టంకించడానికి కవులకు అవకాశం లభించింది. సమాజంలో సౌందర్య, సౌశీల్య, ఆర్జవ, అభిమానాలు మూర్తీభవించిన వ్యక్తులెందరో కవులకు తారసిల్లినారు. ఈతారసిల్లి నస్వరూప స్వభావాలను, హావభావాలను, భాషావిన్యాసాలను పురాణపాత్రలకు పులిమి సజీవమైన పాత్రలుగా చిత్రించ గలిగినారు ప్రబంధ కవులు. పెద్దన వరూధినీ ప్రవరులు, తిమ్మన సత్యభామా నారదులు, తెనాలివాని నిగమ శర్మ, సూరన్న శుచిముఖి, సుగాత్రీ శాలీనులు, చేమకూరవాని సుభద్రార్జునులు ఇంకా యీలాంటివెన్నో పాత్రలు ఇప్పటికీ తెలుగు రసికులకు ఉత్సాహాన్ని. ఉత్కంఠనూ, ఆనందాన్నీ కల్గిస్తూనే ఉన్నవి. సమాజంలో ఎక్కడో ఏకోనలోనో ఈ పాత్రలు పొడకట్టుతూనే ఉన్నవి.

నంది తిమ్మన పారిజాతాపహరణం ఎప్పటికీ పారిజాతంలానే వాడిపోక తావులను గుబాళిస్తూనే ఉన్నది. తిమ్మన సత్యభామ స్వాభిమానసీమ.

డా॥ బి. వి. కుటుంబరాయశర్మగారు తెలుగులో, సంస్కృతంలో ఇంగ్లీషులో మంచి అభినివేశం ఉన్న పండితులు. రసాత్మకంగా పాఠం చెప్పగలిగే అధ్యాపకులు. చమత్కార సంభాషణ వీరి వ్యక్తిత్వానికి ఆమ్రేడితము. తెలుగునవల ఉత్పత్తి వికాసాలను గూర్చి వీరుచేసిన పరిశోధనా వ్యాసంగం విద్వల్లోకానికి తెలుసును. నంది తిమ్మన పారిజాతాపహరణం లోని కొన్ని పద్యాలకు మేముకోరగానే వ్యాఖ్యానం వ్రాసి యిచ్చిన శ్రీ శర్మగారి ఔదార్యానికి, సాహిత్య సేవా పరాయణతకూ మేముసర్వదా కృతజ్ఞులము.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు.

21-12-75

# పరిచయం

క్రీ.శ. 1474 ఫిబ్రవరి, పదియవతిథినాడు జన్మించెనని చెప్పఁబడు రాయలును, ఆతని జైత్రయాత్రలును ప్రసిద్ధప్రబంధములలో వర్ణింపఁబడుట యెల్లరకును విదితము. 'సకలకథాసార సంగ్రహము' నందు (1-25,30) "కీర్తివిస్తార ధురంధరుడు"ను, 'ప్రచండ పరాక్రమ పరరాజ శుండాల కంఠీరవుండును' అగు రాయలనుగురించి చెప్పఁబడినది. తాను 'రాధామాధవకవి' బిరుదమును కృష్ణరాయలవలన నొందితినని చింతలపూడి యెల్లనార్యుడు 'రాధామాధవము' (1-30)లో జెప్పుకొనెను. హంపీశాసనములో రాయల కావ్యనాటకాలంకార మర్మావగాహన సామర్థ్యము కీర్తింపఁబడెను. తన్మాత్రయే కాదు. భానుకవి విరచిత 'పంచతంత్రి' (1-13)లో కృష్ణరాయని కార్యభారధౌరేయుడైన 'లక్ష్మీనారాయణుడు' కూడ స్తుతింపఁబడినాడు 'లీలావతి'యను గ్రంథమునందు 'బొమ్మలాట విరూపాక్ష కాఖుఁడు' రాయలను కొలిచెననియు కలదు.

కృష్ణరాయలు క్రీ. శ. 10-2-1513; 2-5-1513; 13-6-1513; 6-7-1514; (పౌర్ణమీ-గురువాసరే); 2-1-1517; 16-10-1518: 17-2-1521- సంవత్సరములలో నేడు పర్యాయములు తిరుపతికి వేంచేసి శ్రీ వేంకటేశ్వరస్వామిని సంసేవించిన మహాభక్తుడు. శ్రీ వేంకటేశ్వరాలయ ప్రాంగణములో తిరుమలయందు చిన్నాదేవీ తిరుమలదేవీ సమేతుడైన కృష్ణరాయల కాంస్య విగ్రహమును నేటికిని సందర్శింపఁగలము. రాయలకు తిరుమలదేవియు చిన్నాదేవియు ప్రతాపరుద్రగజపతి పుత్రికయు అను మువ్వురు భార్యలున్నట్లు కావ్యములవలన విశదము. విదేశ యాత్రికులు రాయల కింకను పదిమంది భార్య లుండిరని వ్రాయుట వేరు మాట.

(i) తిరుమలదేవి:- ఈమె రాయల పట్టమహిషి; రాయలకు పట్టాభిషేక కాలమునాటికే భార్యయై యున్న (స్వారో 1-33-) ఈమె యెవరి పుత్రిక యను విషయమున భిన్నాభిప్రాయము లున్నవి. కాని, యే అభిప్రాయమునకును నిష్కృష్టమైన ఆధారములు లేవు. రాయలు 'తిరుమలదేవీ మలయకూట హర్మ్య విహారి' (స్వారో-3-143) అనియు, 'తిరుమలదేవీ హృదయేశుఁ డనియు (పారి-5-1) మాత్రము కీర్తింపఁబడినాఁడు.

(ii) చిన్నాదేవి:- ఈమె రాయల రెండవభార్య; మొదటి ప్రియురాలు. రాయలు 'చిన్నమదేవీ జీవితనాయకుఁడ'ని (పారి 34-1) ప్రశంసింపఁబడెను. ఈమె వేశ్యయని కొందఱ యభిప్రాయము. కాని దానికి ప్రమాణము లేవు. 'స్వారోచిషమనుసంభవము'నం దీమె రాయల 'దేవేరి' యనియే చెప్పఁబడినది (ఆ 1-ప 33).

(iii) గజపతి పుత్రిక:-రాయల మూడవభార్య. ప్రతాపరుద్ర గజపతి పుత్రిక. పల్వురు పలు పేళ్ళతో నీమెను పేర్కొనిరి. గజపతి తన కుమారిని రాయలకిచ్చినట్లు అల్లసానివారిదిగఁ బ్రసిద్ధిగాంచిన చాటుపద్యము నందలి 'ఘనతర నిర్భర గండపెండెర మిచ్చి కూఁతు రాయల కొడఁగూర్చినాఁడు' అను పాదమువలన విదితమగుచున్నది. ఇదియేగాక. మరికొన్ని సమకాలిక గ్రంథములు కూడ నీ వివాహమును ధ్రువీకరించినవి, కృష్ణరాయల పట్టాభిషేకాది వైభవములను గూర్చి చెప్పు గ్రంథములలో "కృష్ణరాయ విజయము" పే రెన్నికఁగన్నది. ఈ గ్రంథములనుబట్టి గజపతిసుతపేరు "తుక్కాకరమణి [1]. రాయ లీమెను నిరాదరింపఁగా 'కంబముమెట్టు'నం దుండి యీమె రాయలకై దుపద్యములో తన విన్నపము పంపుకొనె నని లోకమునందొక కథయున్నది. ఆపద్యములు "తుక్కాపంచక"మని ప్రసిద్ధి గాంచెను.

"రాయవాచకము"ను బట్టి యీ జగపతి పుత్రిక పేరు 'జగన్మోహిని[2]'నాదెండ్ల గోపమంత్రి "ప్రబోధచంద్రోదయవాఖ్య"యం దీమెపేరు 'భద్ర' "విజయనగర సామ్రాజ్యము" అను గ్రంథములో నీగజపతి పుత్రికపేరు "లక్ష్మీదేవి" యని "కవి తరంగిణి[3]. "ఆముక్తము"[4]నఁ జెప్పబడిన "అన్నపూర్ణ"యను రాయలభార్యయే యీ గజపతికూతురని కొందఱ మతము.

కృష్ణరాయలకు "తిరుమలరాయ"లను పుత్రుఁడును, "తిరుమలాంబిక" యను పుత్రికయు గలరు. ఈ తిరుమలాంబిక ఆరవీటి వంశస్థుఁడైన అళియరామరాయల భార్య. ఉప్పుగుండూరి పెరియణ్ణకవి విరచితమైన 'మీనకేతనాభ్యుదయ'[5] మను అముద్రిత గ్రంథములో నీమెపేరు 'తిమ్మమాంబ' యని ఉక్తము.

కృష్ణరాయలపుత్రుఁడు తిరుమలరాయలు ఆఱేండ్లవాఁడు వ్యాధిగ్రస్తుఁడై తండ్రి జీవించియుండగనే మరణించినాఁడు. వీరుగాక రాయలకు 'కృష్ణమాంబ'యను కూఁతురు గలదనియు నామె సూర్యవంశక్షత్రియుఁడైన "మట్ల వరదరాజు" భార్యయనియు "కవి తరంగిణి [6] చెప్పును. తన చరమకాలమునాటికి రాయలకు "పదునెనిమిది మాసముల నిసుగు" గలఁడని డా॥ నేలటూరి వేంకటరమణయ్యగారి పలుకు.[7]

కృష్ణరాయలకు పట్టాభిషేకజలము తడియారెనో లేదో గజపతులను జయించుటకై పూర్వ దిగ్విజయయాత్రకుఁ బూనుకొనవలసివచ్చెను. ఈతని జైత్రయాత్రలను తిమ్మ

---

1. క.వి. 4-25; 2. రా.వా.పుట 109; 3. సంపు 7- పుటలు 50,51. 4.ఆ1 కాప 33; 5' 3055౹6 తాళపత్ర గ్రంథము, ఆంధ్రసాహిత్య పరిషద్గ్రంథాలయము, కాకినాడ, తూ గో.జి. (ఆం.ప్ర)؛ 6 సంపు7- పుట58. 7. "తెలుగుసంస్కృతి-పుట 393/2 (1959).

నయు పెద్దనయుగూడఁ బేర్కొనిరి. కాని 'మనుచరిత్రలో' పెద్దనచేసిన ప్రసిద్ధమైన 'కలబరిగి' విజయయాత్రా ప్రసంగము 'పారిజాతాపహరణము'లో తిమ్మన చేయఁజాలక పోయెను. దీనిని బట్టి 'పారిజాతాపహరణ' రచన 'మనుచరిత్ర'రచనకు ఒకటి రెండేండ్లు ముందే జరిగియుండు నని సహృదయ విమర్శకులు సమంజసముగను సాధువుగను నిర్ణయించిరి. కాఁగా, పారిజాతాపహరణ రచనయు నంకితమును గూడ క్రీ. శ. 1517 ఫిబ్రవరి ఆఱవతేదీకి మునుపే జరిగియుండనగును. మొత్తముమీఁద రాయలు ఈ కృతినిర్మాణకాలముల నాఁటికి 'మనుచరిత్ర' నిర్మాణకాలమునాటికివలె అంత స్వస్థచిత్తుఁడు కాఁడు. కృతిభర్తృమనస్స్వాస్థ్యమును బట్టియే కృతికర్తకు ప్రోత్సాహము లభించును. తత్ ప్రోత్సాహమును బట్టియే కృతికి కీర్తి లభించుటయి కల్గును.

కృష్ణరాయలదెస నొక దేవేరి (తిరుమలదేవియే) కావచ్చును, ప్రమాదవశమున నొక ప్రణయాపరాధము కావించెను; ఆ భార్యాభర్తల రవరవలు మాన్పఁగోరి తిమ్మయ యీ కృతిని నిర్మించినాఁడు, ఇది యొక కింవదంతి. కావ్యగత సంవిధానము కూడ నీ వదంతితో సంవదించుచు దాని యాథార్థ్యముదెసగా ములుసూపుచున్నది. ఈ కృతికి రావలసినంతకీర్తి రాకపోవుటకు కారణములలో నిది యిట్టి ప్రత్యేక ప్రయోజనముగల దగుట యొక కారణముగావచ్చును. తిమ్మనార్యుని యితరకృతిగా కీ. శే. చేకుమళ్ళ అచ్యుతరావు చెప్పిన "వాణీవిలాసము"ను గూర్చి లోకమున కంతగా తెలియదు. 'పారిజాతాపహరణము' మాత్రము ఆంధ్రకవితాయువతీ విలాసరేఖ వర్ణనలలోను పాత్రల ప్రవర్తనములోను సర్వథా ఔచిత్యమును పాలించినవాఁడు, తిమ్మన. ఇందలి పాత్రపోషణమునుగుఱించి యొకమాట. దీనిలో కవి తానై పాత్రల గుణగణములను వర్ణించుట చాలా తక్కువ. అతఁడు ముడిమాటలలో నించుక పాత్రపరిచయము మాత్రము చేయును. పిదప ఆయాపాత్రల ప్రవర్తనాధికమువలననే వారివారి గుణగణములు వ్యక్తములు కాఁగలవు. తిమ్మన అవలంబించిన నాటకోచిత వైఖరిలో నిది యొక యంశము. ఇందువలన పాత్రలు విస్పష్టరేఖలతో మనకన్నుల యెదుట నిల్తురు. ధీరోద్ధతుఁడు, దక్షిణనాయకుఁడునగు కృష్ణుఁడుగాని, మానిని, ప్రగల్భయు నగు సత్యగాని, కలహతత్పరుఁడు, భక్తాగ్రసరుఁడునగు నారదుఁడుగాని, సమయజ్ఞయు, నిగర్వశేఖరయునగు రుక్మిణిగాని, చదువరుల చిత్తములనుండి చెఱుపునొంది చెడిపోవుట కల్ల.

ఈ ప్రబంధమున కెంద ఱెన్ని మూలము లున్న వన్నను, ప్రధానముగ నిది సంస్కృత హరివంశమునందలి (68-76 అధ్యాయములలోని)కథ నాధారముగా గలది. ఇట్టి మూలానుస్మృతి కూడ దీని అనితర సాధారణత కొక నిదర్శనము. కన్నడములోని 'హరికథాసారము దీనికంటె ముందున్నదో వెనుకదో చెప్పజాలము. అయినను నిది 'సానలు దేరిన జాతిరత్నము' మాత్రముగాదు. 'మనుచరిత్ర' కంటె నిది ప్రాచీన మనుట కిందలి ప్రసిద్ధేతి వృత్తముకూడ నొక కారణము.

ప్రబంధరచనాసంవిధానము ఆనాఁటికి ఉద్గమదశయందే యున్నది. 'పారిజాతాపహరణము'నేతత్ ప్రబంధోద్గమ మనవలెను. ఆ కాలము ప్రబంధరచనాసంవిధాన ప్రసూతి వేదనాకాల మన్నమాట. కావున ప్రబంధసౌధమునకు శంకుస్థాపనఁజేసినది తిమ్మనయే: 'పారిజాతాపహరణము'లో విరివిగ వీర వృత్తాంత విశదీకరణము కలదు. శృంగార మున్నంతవఱకే పూర్వ మిది ప్రజాదరమును సంపాదింపఁగల్గుట సహృదయులకు విచారహేతువు. కావ్య యావత్స్వమును కలాశిల్పమర్మ సర్వస్వమని యిప్పుడిప్పుడే యిందలి దృశ్యములను ప్రవేశకములను అంకములను గుఱుతించిన విజ్ఞులు విశదీకరించుచున్నారు. నేఁటివఱకు నీ కృతికి రావలసినంత కీర్తి రాలేదు. దీనికి కారణములుగా, కవి యద్వైతి యగుటయు, కృతిదత్త ప్రయోజనముగల పురాణేతివృత్తమగుటయు, కల్పనాకథ గాక పోవుటయు, వంటివి చెప్పవచ్చును. కాని, యన్నిటికంటె ముఖ్యకారణము. రాయల చిత్తము ఆనాఁడు దీనికి తగినంత ప్రోత్సాహ మీయఁగల ప్వాస్థ్యమును భజింపకుండుటయే యనుట యుక్తము.

తిమ్మన కౌశిక గోత్రుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; ఆర్వేల నియోగి; తిమ్మాంబా సింగయామాత్య పుత్రుఁడు; 'మలయమారుతకవి' అని కీర్తిగాంచిన ఘంట సింగయకు మేనల్లుఁడు; కృష్ణరాయలచే చతురంతయాన మహాగ్రహార సన్మానము లొందినవాఁడు; శివపరాధీన మతి; అఘోర శివగురుశిష్యుఁడు; క్రీ. శ. 1522 ప్రాంతముదనుక రాయల కాస్థానకవి; విద్యాధికారి.

మధురకవియు క్రాంతదర్శియునైన తిమ్మన మానవ జీవిత సౌందర్యమును గుఱించియు దాని విషాదాంత పరిస్థితిని గుఱించియు కూడ గానము చేసెను; ప్రకృతి వైభవమును, తన పురుషాంతరమునకుఁజెందిన సకలాంధ్ర భారతోర్వులలోని మానవ వ్యక్తిత్వమును గుఱించియు కూడ కుంజించినాఁడు; ప్రపంచదుర్వార పరిణామమును, దశాబ్దుల శతాబ్దుల నడల హొయలును, విశ్వాంతరాళ వినివిష్ట సమగ్ర దృష్టినికూడ గుర్తించి కీర్తించినవాఁడు. తిమ్మయజీవిత మంతయు ప్రధానముగ సాహిత్యక రాజకీయాధ్యాత్మిక ద్రోణములలో ప్రస్తృతము. సమకాలీన చరిత్ర ప్రతిబింబించెడి తాత్త్విక భౌద్ధిక ప్రకుపిత కల్లోలములను పురస్కరించుకొని యీతఁడు తన జీవిత ధోరణులను నిదర్శించి, నిదానించి నిరూపించుకొనెను. ఈతని యాలంకారిక రచన మంతయు భారతీయ జీవితమునుండి అపచయింపఁబడినదే:

'యువభారతి'వారి ప్రణాళిక ననుసరించి కొన్ని పద్యములలోని సౌందర్యము, ఉల్లాసము, ఉదాత్తతయు సంగ్రహముగ నీగ్రంథమున పొందుపఱుపఁబడినవి. 'యువభారతి'కి నాయెడఁగల అపార కారుణ్య తరణమున కిది యొక తరణి; ప్రీతి చంద్రిన కిది యొక నూలుపోఁగు; దానియెడఁగల వరివస్యాభావవారధి కిది నా ఉడుత భక్తి.

విద్యానగర్ బి.వి. కుటుంబరాయశర్మ.
హైదరాబాదు-44

# తిమ్మన కవితా వైభవం

## 1

పొలఁతుల్ గౌఁగిటఁ గ్రుచ్చియెత్తి తలఁబ్రాల్ వోయించు నవ్వేళ నౌఁ
దల గంగం దననీడఁ దాన కని మౌగ్ధ్యం బొప్ప వేఱొక్క తొ
య్యలి యంచున్ మది నెంచు పార్వతి యసూయావాప్తికిన్ నవ్వు క్రొ
న్నెలపూఁదాలుపు కృష్ణరాయనికి సంధించున్ మహైశ్వర్యముల్.

[పారి-ఆ1-ప2]

ఈ పద్యములలో పార్వతీపరమేశ్వరుల వివాహ వర్ణనము పేరిట శివుని స్తుతించుట జరిగెను.

పార్వతీదేవి తాను సిగ్గుచే పరమేశ్వరుని తలపై స్వయముగ తలఁబ్రాలు పోయఁజాల కున్నదఁట! శుభసమయములో ఆ రీతిగ నామె వెనుదీయుట చెలులు చూచిరి. వెంటనే వారు ఆమెను కౌఁగిట చిక్కబట్టి లేవనెత్తి ధవునితలపై తలఁబ్రాలు పోయించినారు. అప్పు డామె పతి జటాజూటమునందుగల గంగలో పతిఫలించిన తన నీడల తాను జూచి అతఁ డింతకుపూర్వమే యింకొకస్త్రీని స్వీకరించియుండు నని అజ్ఞానముచే భ్రమసి అసూయ పొందినది. ఆమె యీర్ష్యా కషాయితత్వమును కనిపట్టి భర్తయగు పరమశివుఁడు అట్టి తెలివితక్కువదనమునకు నవ్వెను. ఈ రీతిగ మందహాసాలంకృత వదనుఁడైన మహేశ్వరుఁడు శ్రీకృష్ణరాయలకు మహైశ్వర్యములను సమకూర్చుగావుత మని తిమ్మనార్యుని ప్రార్థన.

తెలుఁగున మహాకవిత్వములో కవులు తాము ప్రధానముగ చెప్పఁదలఁచినదానిని చెప్పక, అప్రధానమైనదానిని చెప్పి (వాచ్యము చేసి) ప్రధానమైనదానిని వ్యంజింపఁజేయుట అధికము. ఇచ్చట కవి పైఁకి శివస్తుతి చేసినను, తన కథావస్తువు కొంత యీ స్తవములో వ్యంజిత మగుట యాతని ప్రధానాశయము. కావున కావ్యార్థసూచన మీ పద్యములో జరిగెను. అది యెట్లనఁగా.

తనకు నారదుఁ డొసఁగిన పారిజాతమును శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవి కొసఁగెను. ఆయిచ్చుట తనపై ప్రేమ లేనికారణమున జరిగె నని సత్యభామ తథ్య మెఱుఁగక

అసూయపడినది. ఈ సత్యాదేవి అసూయ, పార్వతీదేవి అసూయావర్ణనము మూలమున వ్యంజింపఁబడుచుండెను.

తనసీడ దాన కని మౌగ్ధ్యం బొప్ప అనుటవలన సత్యభామ ఊరకయే భ్రమ చెంది, యీర్ష్య నొందిన దనియు, ఆవిషయములో కృష్ణుని దోష మేమియు లేదనియు వ్యంగ్యస్ఫూర్తి కలుగుచున్నది.

తిమ్మన శివునిగూర్చి 'క్రొన్నెలపూఁదాలుపు' అని వ్యవహరించినాఁడు, ఇందువలన పారిజాత కుసుమ ధారణము ధ్వనితము. తిమ్మయ స్వయముగ శివభక్తుఁడు; పరమ మాహేశ్వరుఁడు. శివుఁడు సంపత్ప్రదాత. అందుచే రాయలకు మహైశ్వర్యముల నొసఁగు మని కవి తన యిలవేల్పును ప్రార్థించుట యెంతయు హృద్యము. రాయలు చంద్రవంశ మణి గదా! శివుఁడు చంద్రచూడామణి గదా ! ఇందుచే తిమ్మన ప్రార్థనలో ఇంకను సామంజస్య మున్నది. అంతేగాదు; శివునకు శిరమున మందాకిని యున్నది; చంద్ర చూడ మున్నది. అతఁడు వివాహ మంగళ కౌతుక వశమున మందహాసాంచిత వద నుఁడై యున్నాఁడు; పార్వతియెడ ప్రీతుఁడై ప్రసన్నుఁడై యున్నాఁడు. ఇట్టి శుభ సమయ స్థితుఁడైయున్న యీశ్వరుఁడు రాయలకు ఐశ్వర్యముల నిచ్చుట సులభ సాధ్యము.

నంది తిమ్మరాజు సత్యసంకల్పుఁడు; అవితథవచస్కుఁడు. పూర్వదిగ్జైత్ర యాత్ర ముగిసిన పిదప 'పారిజాతాపహరణము'ను కృతినొందిన కృష్ణరాయలు ఆ తరు వాత 'కలబరిగి' విజయ యాత్రాదికమును పూర్తిచేయఁగల్గుటయే అందుకు నిదర్శనము

తీయని చిన్నపదములలో గొప్ప వ్యంగ్యార్థమును పొదివిన తిమ్మనార్యుని అర్థ సంగ్రహత శ్లాఘింపఁ దగినది.

క్రొత్త పెండ్లికూఁతురు సిగ్గుచే తన పతి తలపై తానై తలఁబ్రాలు పోయలేదు, ఇది నవవధూలక్షణము. ఐనను ఆమెకు ఈర్ష్యమాత్ర మప్పటికే యేర్పడును. ఈ మౌగ్ధ్యము పతికి నవ్వుఁ గొల్పి తీరును.

పెండ్లిలో వధూవరులు తలఁబ్రాలు పోసికొను ఆచారము దాక్షిణాత్యులలో ఒక్క తెలుఁగువారిదే బహు పురాతన మనిపించుచున్నది, ద్రావిడులలో నిది పూర్వమునుండియు ఉన్నట్లు కానఁబడదు. ఔత్తరాహులలో మహారాష్ట్రులది మఱల నీ విషయమున ఆంధ్ర సంప్రదాయమే! ఉత్తరాభిమన్యుల వివాహము నిట్టి ఆచారములతో తిక్కనార్యుఁడు తెలుఁగువారి వివాహముగఁ జేసివేయుటతో మహాభారతము మనకు మఱింత సన్నిహిత మైనది. ప్రబంధకవులు తిమ్మనను బట్టియే తలంబ్రాల వర్ణనకు తలకొని రనవచ్చును.

## 2

తన దంతాగ్రముచేతఁ దీక్ష్ణమతి, నుద్యత్కుంభయుగ్మంబుచే
త నితాంతోన్నతి, దానవిస్ఫురణ నుత్సాహంబు; శుండాముఖం
బున దీర్ఘాయువు, నిచ్చుఁ గావుత గుణాంభోరాశికిం గృష్ణరా
యనికిన్ వారణరాజవక్త్రుఁడు కృపాయత్తైకచిత్తాబ్జుఁడై.

[పా౦రి - ఆ1 - ప౦1]

ఈ పద్యమున గణాధిపతిస్తుతి జరిగెను. వినాయకుఁడు ఏనుఁగుమోము గల వాఁడు. తన దంతాగ్రము తీక్ష్ణమై యుండుటచే ఆ వినాయకుఁడు కృష్ణరాయలకు బుద్ధి తీక్షత్వము నొసంగవలె నని తిమ్మనార్యుని ప్రార్థన. అట్లే విఘ్నేశ్వరుఁడు తన కుంభములు ఉన్నతములు గావున అత్యంతోన్నతిని, తన మదజల ప్రకాశము ఉత్సాహ కార్యముగావున ఉత్సాహశక్తిని, తన తుండము అతి దీర్ఘము గావున దీర్ఘాయుష్యమును కృష్ణరాయలకు ప్రసాదింపవలె నని తిమ్మనార్యు నభ్యర్థనము.

విఘ్నేశ్వరుఁడు తన దంతాగ్రముచే తీక్షమతి నిచ్చుఁగావుత మనుటవలన ఆతని యేకదంతము తీక్ష్ణమైయున్న దనెడి ధ్వని కలుగుచున్నది. అట్లే ఆతని కుంభము లున్నతము లనియు దాన విస్ఫురణము ఉత్సాహశక్తితో గూడిన దనియు శుండా ముఖము దీర్ఘ మనియు ధ్వను లేర్పడఁ గలవు.

లోకమున నెవరికి ఏది కలదో దాని అనురూపమైన దానినే యితరుల కీయఁ గలరు. ఇచ్చట గణాధిపుఁడు ఆత్మావయవ రూపసౌష్ఠవములకు అనురూపము లగు గుణాదులనే కృష్ణరాయలకు ఇచ్చుఁగాక యని కవి ప్రార్థించుటలో చమత్కృతి కలదు. తీక్ష్ణమతియు ఉన్నతియు ఉత్సాహమును వంటివి కృష్ణరాయల కింతకుపూర్వమే యున్నను వానిని అత్యంతముగ ఇమ్మని కవి ప్రార్థించుచున్నాడు. రాయలకు తిరుమలదేవిపై ప్రణయకోపము కలిగి ఆమె సౌధమును ఆయన చాలాకాలము ప్రవేశింపక పోవుటచే ఈ 'పారిజాతాపహరణము'ను-తిమ్మనార్యుఁడు రచించి రాజదంపతులను తిరిగి కలిపినట్లు ప్రబలమైన ఐతిహ్య మున్నది. అందుచే తిరుమలదేవి వేదనను సాను భూతితో ఆవేశించు కొనుటకుఁ గాని, అనంతర జైత్రయాత్రలకుఁగాని రాయలవారికి నితాంత విశితబుద్ధిని, నితాంతోన్నతిని, నితాంతోత్సాహాది శక్తులను ప్రసాదింపు మని తిమ్మనార్యుఁడు విఘ్నరాజును ప్రార్థించుట యుక్తియుక్తమును హృద్యమును సారస్య మును అనిపించును. అతఁడు అర్థసంగ్రహతకు పెట్టినది పేరు

తిమ్మనార్యుని నాలుకకు ఎన్నఁడును రెండు పలుకు ఒదవదు. ఈ ప్రార్థనా పరముగ అతఁడు ఉద్దేశించిన ఉద్దేశము లన్నియు నెఱవేఱినవి.

**3**

సరసపుటల్కఁ దీర్చుతఱి శార్ఙ్గసుదర్శన నందకాబ్జ సం
భరణగుణాప్తి నెన్నడుముపైఁ గటిపై జడపై గళంబుపై
హరినలుగేలఁ బైకొన సుఖాంబుధి నిచ్చలు నోలలాడు నిం
దిర కృపఁజూచుఁగాత నరదేవశిఖామణిఁ గృష్ణరాయనిన్.

(పారి. ఆ1 - ప4)

ఈ పద్యమువలన లక్ష్మీదేవి స్తుతింపబడినది. శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవికిఁ గల్గిన ప్రణయ కోపమును తీర్చి ప్రసన్నురాలిని చేసికొనఁగోరెనఁట! అందుచే ఆ పొలయలుక యెట్లు మాన్పఁబడెనో యీ పద్యమున వర్ణితము. విష్ణువు శార్ఙ్గమును వింటిక ధరించు తన ఒకచేతిని లక్ష్మీదేవి నడుముమీఁదను, సుదర్శన మను చక్రమును ధరించు తన ఒకచేతిని ఆమె కటిప్రదేశముమీఁదను. నందక మను ఖడ్గమును ధరించు తన ఒకచేతిని ఆమె జడమీదను, అబ్జ మను శంఖమును ధరించు తన ఒకచేతిని ఆమె మెడమీఁదనుచేర్చి ఉపలాలించి ప్రసన్నురాలిని చేసికొనినాఁడు.

ఆమెను లాలించుటకై అతఁడు తాఁకిన ఆయా అవయవములనుబట్టి ఉపమాన వస్తువులు స్ఫురించుచున్నవి. విల్లుపట్టెడి చేతితో నడుమును తాఁకుటచే ఆమె నడుము సూక్ష్మమై పిడికిటఁ బట్టుటకు తగియున్న దనియు, చక్రము తాల్చెడి చేతితో కటిసీమను తాఁకుటచే ఆమె కటిప్రదేశము చక్రమువలె నున్నదనియు, కత్తిని ధరించెడి చేతితో జడను తాఁకుటచే ఆమెజడ కత్తివలె నున్నదనియు, శంఖమును తాల్చెడి చేతితో కంఠ మును తాఁకుటచే నామె కంఠము శంఖమువలె నున్నదనియు ధ్వను లేర్పడుచున్నవి.

ఇట్లు పతిచే లాలింపబడి ప్రణయకోపము తీరి సంతోషస్వాంత యగులక్ష్మి, కృష్ణరాయలను అనుగ్రహించుగాక అనుటలో "పారిజాతాపహరణ" కథావస్తువు కూడ ధ్వనించుచున్నది. లక్ష్మీదేవికి వ్యక్తవ్యవిషయమున కనుకూలించునట్టి ఆకారోల్లా సాదులను తిమ్మనార్యుఁడు అనుసంధించుటయేగాక 'పారిజాతాపహరణ' ప్రబంధములో కృష్ణుఁడు చేసిన సత్యావధూప్రీణనమును, దానివలన సత్యాదేవికిఁ గలిగిన సంతసమును గూడ నీపద్యములో హృద్యముగ వ్యంజిత మొనరించుట జరిగెను. ఇది వస్తు కృత శిల్పము.

ఇన్ని ప్రయోజనములును ఒక్క పద్యములో సాధించుట తిమ్మనవంటి మహా ప్రతిభావంతులగు కవిసు త్రాములకే చెల్లినది,

4

వలిమలయల్లువాఁడు, తలవాక ధరించిన పూవుగుత్తి, వే
ల్పులగమి జీవగఱ్ఱ, యుడివోవని చల్వలచెంకి, వెన్నెలల్
మొలచినపాదు, పాల్కడలి ముద్దులపట్టి, నృసింహకృష్ణరా
యలఁ గరుణారసంబు నినుపారెడిచూపులఁ జూచుఁగావుతన్.

(పారి–ఆ1–ప6)

ఈ పద్యములో చంద్రస్తుతి జరిగినది. తన్మూలమున చంద్రుని మూల పురుషునిగాఁగల రాయలను స్తుతింపబడినాఁడు. అది యెట్లనగా:—

శివుని జటాజూటమునందలి ఆకాశగంగతోగూడి పూగుత్తి వలె వెలుఁగువాఁడును, దేవతలసమూహమునకు జీవనాధారమైనవాఁడును, తఱుఁగని చలువలకు స్థానమైన వాఁడును, పాలసముద్రముయొక్క ముద్దుకుమారుఁడును, అయిన చంద్రుఁడు, కృష్ణ రాయలను అధికమైన దయతో తిలకించుఁగాక యని తిమ్మనకవి ఆశయము.

చంద్రుడు రాయలవంశమునకు మూలపురుషుఁడు. ఆ మూలపురుషుని శివుడు తన శిరస్సునఁ దాల్చెను. 'నెత్తినిబెట్టుకొనుట' యనఁగా, సజ్జనశ్లాఘనీయుఁ డనుట. అట్లే చంద్రుడు తన కళలను దేవతలకు ఆహారముగా నిచ్చుచున్నాఁ డనుట, వారికి జీవనాధారమై పరఁగుచున్నాఁ డనుట; అతడు శైత్యములకు నిలయ మనుట; చల్లనివాఁ డనుట; వెన్నెలలు పుట్టుటకు తావలమైనవాఁ డనుట; ఆహ్లాద సంధాయకుఁ డనుట.

చంద్రునకు జెప్పఁబడిన యీవిశేషణము లన్నియు రాయలకుఁగల సుగుణములే అనెడిధ్వని యొకటి యిచ్చట స్ఫురించును. శివుడు చంద్రుని శిరస్సునఁ దాల్చినవాఁ డనుటచే, రాయలు సజ్జనశ్లాఘనీయుఁ డనియు, దేవతలకు (చంద్రుఁడు) ప్రాణాధారుఁ డనుటచే, రాయలు పూజ్యులకు జీవనాధారభూతుఁ డనియు, తఱుఁగని చలువలకు (చంద్రుఁడు) నిలయ మనుటచే, రాయలు శాంత్యాది సుగుణభూషితుఁ డనియు, వెన్నెలలు మొలిచినవాడు (చంద్రుఁడు) అనుటచే, రాయలు సర్వజనాహ్లాదకరుఁ డనియు ధ్వనులు ఊహింపఁదగి యున్నవి ఇందుచే శ్రీకృష్ణరాయల సౌజన్యమును సౌశీల్యమును సౌమనస్యమును, సౌహృదయమును వంటి సద్గుణములు స్ఫురింప గలవు.

చంద్రుని స్తుతించు నెపమున రాయల సుగుణసంపత్తిని వర్ణించుట, రాయలను 'నితాంతోన్నతుఁడవు గమ్ము' అనుటకొఱకే యనుకొనవలెను. తన్మూలమున రాయలకు అంతఃపుర వధూ ప్రాసాదనకర్తవ్యములును గుర్తుచేసిన ట్లగుచున్నది.

తిమ్మనకుఁ బూర్వము చంద్రస్తుతి చేసినకవుల సంఖ్య బహుసకృత్తు. అందుచే ఈపద్యమును 'చంద్రస్తుతి' అనుకొనుటకంటె కృతినాయక వంశానువర్ణన మనుకొనుట యుక్తము. తిమ్మనార్యుడు కృతికర్తృవంశా [తన వంశా]ను వర్ణనము చేయలేదు. సుకవిస్తుతియు, కుకవినిందయు చేయలేదు. పరంపరాగత మను కృతికర్తృ స్వప్న వృత్తాంతము చాయకుఁబోలేదు; కృతిభర్త తన్ను కర్పూర తాంబులాదులతో అర్చించి తన కావ్యము నంకిత మిమ్మని అర్థించినట్లును చెప్పుకొనలేదు. ఈ కారణము లన్నియు నీగ్రంథము ప్రత్యేకప్రయోజనాత్మకమై 'వ్యవహార విదే శివేతర క్షతయే' వంటి కావ్య ప్రయోజన సాధకమై నెగడిన ప్రబంధ మనుటకు ఉదాహరణము లగుచున్నవి, అంతే గాదు ఈయీకారణములచే నొకగ్రంథమునకు గౌరవము 'సందర్భశుద్ధియు' పాత్రపోషణాదికమును కథాసంవిధానచాతుర్యమును, ఔచితీపోషణమును, హృదయంగమశైలియు రచనాపాటవమును,రసచర్వణమును మొదలైనవానిమూలముననే సంపాద్యమగునుగాని, దాని లేనిపోని పైపైమెఱుగులుగల పోకడలవలనఁ గాదని మన మూహించుకొనుట తప్పు గాదు. అట్లే తిమ్మనార్యుని యీ 'పారిజాతాపహరణము' ప్రబంధ సాహిత్య సౌధ నిర్మాణమునకు శంకువువంటి దనియు 'మనుచరిత్రా'దులు తరువాత వెలసినసౌధము లనియు మన మూహింపవచ్చును. 'మహాప్రబంధము' అను పదబంధమును గూడ ప్రత్యేక సాహిత్య ప్రక్రియా పరముగ ప్రయోగించిన ప్రథమకవి తిమ్మనార్యుఁడే (పారి-1-34).

'ప్రబంధము', 'కావ్యప్రబంధము'వంటి పదబంధములను సాధారణ కావ్య పరముగ ప్రయోగింపని సంస్కృతాంధ్రకవులు లేనేలే రనవచ్చును. నన్నెచోడ, ఎఱ్ఱనార్య, శ్రీనాథాదుల కావ్యములలో స్వచ్ఛమగు భావ ప్రబంధ లక్షణ బీజములు నుండవచ్చును. కాని 'ప్రబంధ' శబ్దము ఒక విశిష్ట సాహిత్యప్రక్రియకు నిర్దేశకమైనది, 'పారిజాతాపహరణము'తోడనే అనినచో తప్పులేదు. కావున తిమ్మన ప్రబంధ ప్రక్రియకు పరమేష్ఠి.

పై పద్యమున తొలి మూఁడు పాదములును ముద్దులు మూఁటగట్టు అచ్చ తెలుఁగు పదములతో సంధానింపఁబడినవి. ఈ పద్యమే సరళాన్వయముతో ఒకప్రాఁత ప్రతియం దిట్లున్నది.

"వలిమల యేలువాని తలవంకఁ దనర్చిన పువ్వుగుత్తి, వే
ల్పుల గమికుఱ్ఱ, పాల్కడలి ముద్దులపట్టి పయోజవైరి, చు
క్కల గమికాఁడు, జక్కవల గాసి, విధుండు నృసింహకృష్ణరా
యలఁ గరుణారసంబు తనరారెడు చూపులఁ జూచుఁగావుతన్."

కాని తిమ్మనార్యుఁడు తన అచ్చతెలుఁగునుడుల కూర్పులో ప్రౌఢత్వము సాధింపఁగోరి (i) 'పయోజవైరి', (ii) 'విధుండు' వంటివానిని పరిహరించి ఉన్న అయిదు విశేషణములను తెలుఁగు నానుడుఁలతో నందగించునట్లుగఁజేసి పద్యమును పరిష్కరించి మనము వ్యాఖ్యానించిన రూపమునకుఁ దెచ్చియుండును. ఒక్కొక్కప్పుడు కవులకు ఒకే పద్యము రెండు మూఁడు మాఱులు రచించినఁగాని సంతుష్టి కలుగదు. ఆ రెండు మూఁడు రూపములుగల ఒకే పద్యము భిన్నభిన్న తాళపత్ర గ్రంథములలో భిన్నభిన్న రూపములతో లభించుట కలదు. మొత్తముమీఁద ఈపద్యము ప్రోకద నందివారి తిమ్మకవికి చాల నిష్టమనుటకు 'పారిజాతాపహరణము' నుండియే చంద్రోదయవర్ణన రూపమగు నింకొక యుదాహరణము నిచ్చినఁ జాలును. అది సమ సంస్కృతాంధ్రపద మిలితమై, కవి భావనా లులితమై యున్నది :

"అమరుల బోనవుట్టిక, సహస్రమయూఖుని జోడుకోడె, సం
తమసము వేరువిత్తు, కుముదంబుల చక్కిలిగింత, పుంశ్చలీ
సమితికిఁ జుక్కవాలు, నవసారసలక్ష్మి తొలంగుబావ, కో
కములకు గుండెతల్లడము, కైరవమిత్రుఁడు దోఁచె తూర్పునన్."

(పారి ఆ-2, ప-41)

## 5

యాదవత్వమున సింహాసనస్థుఁడు గామి
సింహాసనస్థుఁడై చెన్ను మెఱయ
గొల్లయిల్లాండ్రతోఁ గోడిగించుటఁ జేసి
పరకామినీ సహోదరతఁ జూప
మఱి జరాసుతునకై మధుర డించుటఁ జేసి
పరవర్గదుర్గముల్ బలిమిఁగొనఁగఁ
బారిజాతము నాసపడి పట్టి తెచ్చుట
నౌదార్యమున దాని నడుగువఱుపఁ

గోరి తొలుమేనఁ దన కైన కొదువ లెల్ల
మాన్చుకొనవచ్చి భువనైకమాన్యలీల
నవతరించిన కృష్ణుఁడౌ ననఁగ మించె
నరసవిభుకృష్ణరాయ భూనాయకుండు. [పారి-ఆ1-ప 17]

ఈ పద్యములతో శ్రీ కృష్ణుఁడే తనకు కృష్ణావతారమునందు కలిగిన లోపములను బాపికొనఁగోరి యిప్పుడు కృష్ణరాయలై అవతరించి ఆ మచ్చలను మాన్చుకొనినాఁ డని వర్ణింపఁబడినది :

గొల్లలలో "యదువు" అను వాని శాఖకుఁ జెందిన గొల్లలకు సింహాసనమెక్కి కిరీటము ధరించు నధికారము లేదు. అందుచే కృష్ణావతారమున సింహాసన మధిష్ఠింప లేకపోయిన శ్రీకృష్ణుఁడు ఈ జన్మలో కృష్ణరాయలై విజయనగర వజ్రసింహాసనస్థుఁ డయ్యెనఁట: అలనాఁడు శ్రీకృష్ణుఁడు గోపికాలోలుఁ డయ్యెను; ఈ జన్మలో నతఁడే రాయలై జన్మించి ఆ లోపమును తీర్చికొనుచు పరస్త్రీలను అక్కసెల్లెండ్రవలె అరయుచున్నాఁడు. అపుడు జరాసంధునకు భయపడి మధురానగరమును విడిచిపోయెను; ఆ అపకీర్తి నశింప ఇపుడు కృష్ణరాయలై పుట్టి శత్రుదుర్గములను జయించి స్వాధీనము చేసికొనుచున్నాఁడు. ఆనాఁడు పారిజాతవృక్షము నాసించి తెచ్చికొనుటచే కొంత నింద పొందెను; ఈనాఁడు ఆ నిందను క్రిందుసేయఁగల దానములయందు పేరుపొంది యున్నాఁడు. ఈ రీతిగ తొలి జన్మమునఁ గల్గిన కొఱఁతలను మాపుకొనుటవలన శ్రీకృష్ణుఁడే కృష్ణరాయలుగా నవతరించె ననుట నిస్సందేహ మని భావము.

కవుల వర్ణనలనఁగాని సాధారణ ప్రజానురాగమువలనఁగాని మొత్తముమీఁద శ్రీకృష్ణరాయలు శ్రీకృష్ణుని అవతార మనెడి ప్రబలవిశ్వాస మొకటి ఆనాఁడు ప్రచలిత మనుటకు నిదర్శనము లున్నవి

పారిజాతాపహరణమునందే :
"........................
నాఁడు నేఁడును యాదవాన్వయమునందు
జనన మందెను, వసుదేవ మనుజవిభుని
కృష్ణుఁ డనుపేర, నరసేంద్రు కృష్ణదేవ
రాయఁ డనుపేర, నాదినారాయణుండు." (ఆ-1, ప-19)

అని మఱల తిమ్మనార్యుఁడు వక్కాణించెను. "కృష్ణావతారమున నీయందు కుపితురాలగు సత్యభామవలన జరిగిన మన్ననయే ఈ యవతారమునను తిరుమల (?) దేవివలన జరిగినది" అను స్ఫూర్తి కలుగు నిమిత్తమే యీ మహాప్రబంధమును తిమ్మనార్యుఁడు రచించెనను ఐతిహ్యమునందు చాల సత్యమున్న దనక తీరదు. కృష్ణుఁడే కృష్ణరాయ లని అవతారికలో చెప్పుచు కథలో పాదతాడన వర్ణనముచేయుచో, లోకప్రతీతి యట్లుండఁగా, ఇఁక "పారిజాతాపహరణ" కృతి ఒక ప్రత్యేకప్రయోజనాపేక్ష కలదన్నయెడల తప్పేమి?

కొందఱు విమర్శకులు రాయలకు ఏ భార్యాపాదము సోకెనో తెలియరా దనిరి. పితృదత్తగాక చిననాటినుండియు వలచి వలపించి వివాహమాడిన చిన్నమదేవి అంత అశ్రద్ధఁ దాల్చుట సాధారణముగ జరుగదు. పైఁగా, భర్తవచ్చువఱకు ప్రక్కపై పాదము లుండువైపుననే తలపెట్టుకొని భార్యా పరుండవలె నను ఆచారము పట్టమహిషులకును క్షత్రియకాంతలకును అనువర్తించు ఆచారము. పైఁగా, చిరకాలమునుండియు పుత్రులు లేని రాయలకు క్రీ.శ. 1518లో పుత్రోదయ మయ్యెను. ఈ సహకారి కారణమును పురస్కరించుకొని ప్రణయాపరాధము క్రీ.శ. 1515లో సంభవించెననియు, తదనంతరము క్రీ.శ. 1516-'17లలో కృతిసమర్పణ పునస్సంయోగము లనియు పిమ్మట నేఁడాదికి పుత్రోదయ మనియు నూహించుట యుక్తియుక్తము. ఆ పునస్సంసదానంద కేళీ పరిణామమే తిరుమలరాయల జనన మైనచో, ఈ పాదస్పర్శకథ యంతయు తిరుమలదేవి దెసగానే ములుసూపు చున్నది. ఒకవేళ చిన్నమదేవి తెచ్చిన అరణపుకవి యైనను, తిరుమలదేవికిఁ కలిగిన కష్టనివృత్తికి తిమ్మనార్యుఁడు కావ్యమును చెప్పుట మిక్కిలి యౌచితీపోషకమై ఔదర్యసూచకమై యుండఁగలదు. తిమ్మన యిందువలన రాయలకు మఱియు సన్నిహితుఁడు కాగలఁడు. నిజమున కేయమ్మయైనను 'అమ్మ తెచ్చిన విద్వాంసుఁడు' చూపఁగల చొఱవ తిమ్మకవిచంద్రుఁడు చూపినాఁడు. రాయల జీవితము తత్కారణముగా సర్వసంపన్న మైనది.

## 6

శ్రీరంగేశ్వర నాభి పంకజ రజ శ్రీకంటె జోశేంద్ర త
న్వీ రాజత్ కుచపాళి మంజరులకంటెన్ సహ్యాభూభృత్ తటీ
నీరంధ్రీకృత గైరిక ద్రవముకంటెన్ వన్నె గావించెఁ గా
వేరితోయముఁ గృష్ణరాయఁ డహితోర్వీనాథరక్త ప్రభన్.

[పారి-ఆ 1-ప 18]

శ్రీకృష్ణరాయలు శత్రురాజులను సంహరించి వారి రక్తమును కావేరీనదిలోనికి ప్రవహింప చేసినాఁడు. అందుచే ఆ నదీజలము శ్రీరంగములోని శ్రీరంగనాయకుని నాభి కమలమందలి పుప్పొడులవలనను, చోళరాజాంగనల స్తనాలంకారము లగు పూవుగుత్తుల వలనను, కావేరీనదికి పుట్టినతావగు సహ్యపర్వతప్రాంతములయందలి గైరికాదిధాతువుల రసమువలనను పొందిన జేగురువర్ణముకంటె మించిన జేగురువర్ణముచే నిపుడు విరాజిల్లె ననుట.

శ్రీకృష్ణరాయలు శ్రీరంగనాథుని సేవించినపిదప ఆ పూజాపంకజములు కావేరిలో కలుపఁబడినపుడు ఆ నదీతోయ మెఱ్ఱఁబడును. ఇందుచే రాయల శ్రీరంగ నాథభక్తి వ్యక్త మగుచున్నది.

రాజకాంతలు విలాసార్థము తమ స్తనమండలములందు మకరికాపత్రరచనలు కావించుకొందురు. అట్టివి శోణవర్ణము కలిగియున్న వన్నమాట. పుణ్యనదీ నియత కచ్ఛములలో రాజస్త్రీలు జలక్రీడలు సలుపవచ్చును. అప్పు డానీరు ఎఱ్ఱదనముదాల్చుట సహజము. లేదా, రాయలు చోళదేశాధిపతులను జయింప వారు తమ భార్యలతో పలాయన మగుచు కావేరిని దాఁటువేళ ఆ చోళాంగనల కుచపాళి విరచిత మకరికా పత్రములచే ఆ జలము ఎఱ్ఱఁబడవచ్చును.

కొండలనుండి క్రిందికిజాఱు నెఱ్ఱని ద్రవపదార్థాదులచే కావేరీజలము మునుపే యెఱ్ఱబడి యుండెను. దానిని రాయలు తన శత్రురాజుల రక్తములచే మఱియు నెఱుపు గావించినాడు. ఎఱుపును మఱింత యెఱ్ఱగాఁ జేయుట అనుగుణముగ నుండి ఔచితీ పోషక మగుచున్నది.

రక్తకాంతి విషయమునందు కావేరీజలము పైమూడింటివలన కంటె, రాయల శత్రువుల రక్తమువలన ఎక్కువగా మించిన దని యీపద్యము పిండితార్థ మైనను, రాయలు క్రమముగ శ్రీరంగమును చోళదేశమును సహ్యపర్వతప్రాంతములను కావేరీ తీరమునందలి శత్రుసముదాయమును జయించి యశస్సాంద్రుఁడై నాఁడనెడి ధ్వని కలుగు చున్నది. ఇందు వర్ణింపబడినది, కావేరీజలము; వ్యంజితమైనది, రాయల పరాక్రమము; రాజ్యపుటెల్లలును. అందుచే ధ్వని (కావ్యము) ఉత్తమమైనదని వేఱుగఁ జెప్పనక్కర లేదుగదా !

7

ప్రామినుకుల దొంగఁ బాతాళకుహరంబుఁ
జొరఁబాటి చీటినచోఱ వీవ
తరిగొండ వెన్నుపైఁ దాల్చి వేల్పుల గూటి
చవిఁ దేల్చినట్టి కచ్ఛపమ వీవ
నీటిలో మునిఁగిన నేలచేడియఁ గొమ్ము
కొన నుబ్బ నెత్తిన ఘోణి వీవ
మునిమాపు బలుగంబమునఁ బుట్టి బంటు న
క్కఱఁ గాచినట్టి సింగంబ వీవ

దితిజు మెట్టిన యాపొట్టి దిట్ట వీవ
పుడమి ఱేడుల నడచిన ప్రోడ వీవ
కడలిఁ గోలకుఁ దెచ్చిన గబ్బి వీవ
యిపుడు ద్వారక నివసించు నీవు నీవ.

రుక్మిణీ సౌధమున నున్న శ్రీకృష్ణు నొద్దకు నారదుడు వచ్చి యాతనిని స్తుతించును. సన్నుతిపూర్వకమైన ఆదశావతారవర్ణనములోని ప్రథమ పద్య మిది. పెద్దలు దశావతారక్రమమునిట్లు చెప్పుదురు :—

శ్లో॥ మత్స్యః కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః,
రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కి రేవ చ.

పై పద్యమున (బలరామునితోగూడిన కృష్ణావతారమువఱకు నవతారములు చెప్పఁబడినవి. (ఈ అవతారములలోని బుద్ధుఁడు గౌతమబుద్ధుఁడు గాడు.) మన యీ "పారిజాతాపహరణ" తృతీయాశ్వాసమునందు శ్రీకృష్ణుం దదితిని జూడఁబోవును అప్పుడు శౌరిపైన ఒక్కొక్క యవతారమును ఒక్కొక్క పద్యముతో నదితి వర్ణించి ఆతని లీలలను ప్రత్యేకమైన దండకమునందు ప్రశంసించినది.

ఆంధ్రసాహిత్యములో శ్రీనాథుడు తన శృంగారనైషధమునందు (సంస్కృత సాహిత్యము ననుసరించి) దశావతార ప్రస్తుతికి శ్రీకారము చుట్టెను. నలుఁడు తన

మాధ్యాహ్నిక పూజావిధియందు దశావతారములను స్తుతించినాడు, చాలవఱకు శ్రీహర్షు ననుసరించి యిచ్చట శ్రీనాథుఁడు ఇరువదితొమ్మిదిపద్యములు కూర్చెను. (శృం. నై. ఆ 8-ప 120-148) తాళ్లపాక అన్నమాచార్యులవారు తమ సంకీర్తనలలో పెక్కు పర్యాయములు దశావతారముల ప్రస్తవమును గానముచేసిరి. ఇవి తిమ్మనార్యు నాకర్షించి యుండవచ్చును. తరువాత రాయలవారు, ఆపిమ్మట పెద్దనార్యుడు, వారివెంట గార్లపాటి (తెనాలి) రామకృష్ణుడు, అటుతరవాత పెక్కుమంది మహాకవులును అవ తారముల ప్రశంస తమతమ ప్రబంధములలో చేసిరి. ఈప్రబంధమునందే అదితి, శ్రీకృష్ణుని ఒక్కొక్క యవతారమును ఒక్కొక్క పద్యములో వర్ణించును (ఆ 3 - ప 28 - 38).

## 8

ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నేమంచు నూహించునో
మది సాత్రాజితి, దాని కే నిపుడు ప్రేమం బంపినన్ దీని నె
ల్లిదముం జేసినజాడ దోఁచునొకో ! యీా లెమ్మిందు నే నుని్కఁ జె
ల్లదువో యేరికిఁ బంపఁగా ననుచు, లీలన్ రుక్మిణీకాంతకున్.

[ఆ 1-ప 54]

తిమ్మనార్యుని ('పారిజాతాపహరణ') నాటకమునకు పూర్వరంగము ముగిసి ప్రథమాంకము ప్రారంభమైనది.

ఒకనాఁడు నారదమహాముని వచ్చి రుక్మిణీ సౌధమందున్న శ్రీకృష్ణునకు పారి జాతపుష్పము నర్పించెను. కృష్ణుఁడు దానిని వినయ విస్మయములతో స్వీకరించి తన దగ్గఱనున్న రుక్మిణివైపు చూచినాఁడు కాని, వెంటనే ఆతని మనస్సులో సత్యభామ నిలిచెను. అట్టి శ్రీ కృష్ణుని మనోవ్యాపారము పై పద్యమున వర్ణితము.

ఈ పుష్పమును రుక్మిణి కొసఁగినచో, ఈమె కర్పించినానని సత్యభామ కోపించి మనస్సున నొచ్చుకొనునేమో। లేక, సత్యభామకు పంపినచో, తన్ను చుల్కన చేసిన ట్లయినదని రుక్మిణి తలఁచునేమో॥ సరే, యేమైన అది యగును నిజముగ నే నీ రుక్మిణీ సౌధమున నుండుటచే ఆమెకుఁ దప్ప మఱి యెవ్వరికిని ఈ పుష్పము నీయరాదు." అని శ్రీకృష్ణుఁడు నిశ్చయించుకొనెను.

అనేక భార్యలయందు సమమైన అనురాగముగల నాయకుని దక్షిణ నాయకుఁ డందురు. శ్రీకృష్ణుఁడు ఇచ్చట నట్టివాఁడు.

'ఔలెమ్మ', 'పో' వంటిపదములు ఇందలివి ఇద్దఱు భార్యల యిబ్బందిలో పడిన శ్రీకృష్ణుని వితర్కాంతర భావి నిశ్చయమును, సునిశ్చల నిశ్చయ దార్ఢ్యమును వ్యక్తము చేయుచున్నవి. ఈ పద్యము రుక్మిణీ సత్యభామలయందు కృష్ణునకుఁగల తుల్యానురాగ మునకు అన్వాదేశము; తిమ్మనార్యునకుఁగల దక్షిణనాయక మనస్తత్త్వ నిదాన సామర్థ్య మునకు అధ్యాహారము. బహుభార్యాత్వముగల ఆ నాఁటి రాజుల బాధలతోడి పరిచ యము, తిమ్మన కవిత్వమును 'సానలు దీరిన జాతిరత్నము'గా మలఁచెను.

## 9

చక్కనిదాన నంచు నెలజవ్వని నంచు జగంబులోనఁ జే
రెక్కినదాన నంచుఁ బతి యెంతయుఁ నాకనురక్తుఁ డంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య, యింతకున్
స్రుక్కక యున్నె నీ మహిమ సూచిన బోఁటులు విన్నవించినన్.

[పారి-ఆ 1-ప 66]

అందగత్తె ననియు, లేఁతవయస్సుదాన ననియు. లోకప్రసిద్ధురాల ననియు, తనయందు పతికి మిక్కిలి అనురక్తి గల దనియు, సత్యభామ చాల గర్వపడుచుండు నఁట! అట్టి ఆమె యిప్పటి పారిజాతపుష్పముచే ప్రకాశించునట్టి రుక్మిణీదేవి మహిమను చూచినచో గాని, విన్నచో గాని (చూచినచెలులవలన విన్నచోగాని,)దుఃఖింపక యుండ గలదా? అని నారదునకు అనుమానము.

నారదునకు కలహభోజనుఁడని పేరు. పారిజాతపుష్పమును రుక్మిణి కిచ్చి దాని మహిమ పొగడి ఊరకుండినచో అతనికి కలహభోజనుఁ డను పేరు సార్థక మగునా? ఈ పద్యమునకు వెనుకనున్న పద్యములో నతఁడు సత్యభామపే రెత్తెను. సత్యారుక్మి ణులు ముందే సవతులు; అందును సత్యాదేవి మానిని; మాత్సర్యశీల. అమానిత్వము, అదంభిత్వమువంటి తత్త్వజ్ఞాన సాధనములతో ఆమెకేమి పని? వెనుకటి పద్యములలో నారదుఁ డామె పేరెత్తి క్రిందుపఱచినాఁడు. దానితో కలహబీజావాపము సంపూర్ణము కాలేదు. అందుచే ఈ పద్యమున మఱియు సత్యను పేరుపెట్టి అధఃకరించుచున్నాఁడు.

పారిజాతమును ధరించిన కారణమువలన రుక్మిణికి మహామహిమ కలిగెను. అందుచే సత్యభామ తన కింతకుపూర్వము సౌందర్య విషయమునను భర్తృనురాగ విషయమునను యౌవన విషయమునను గల గర్వము ఉడిగిపోఁగా, మిక్కిలి స్రుక్కనని నారదప్రవచనము. ఇంతకును సౌందర్యము, పత్యనురాగము, యౌవనము అనువాని విషయములో రుక్మిణియే మిన్న యనియు, ఇఁక ముందు సత్యభామది వట్టి గర్వము మాత్రమే యగుననియు నారదుఁడు చమత్కరించుట కలహబీజములను పూర్తిగా నాటు నిమిత్తమే యనవలెను.

ఒకసవతి చెలికత్తెలు ఇంకొకసవతి అంతఃపురములోని వార్తలను రహస్యముగ మోసికొనిపోవుట ఆనాఁటి యాచారము. ఇందుచే రుక్మిణిని నారదుఁడు పొగడుటయే గాక సత్యను తెగడుటయు కూడ సత్య చెలులు విని, ఆమెకు విన్నవింపవలె ననియే నారదుని ఉద్దేశముగా తోఁచుచున్నది. ఈ ఉద్దేశము భావికథా సూచకము కూడ.

i. ........................ ................'దీని దాల్చి యిప్పడఁతులలోఁ గనుంగొను మపార మహా మహిమాను భావముల్ (1-61)

ii. 'సవతులు వచ్చి నీ చరణ సారసయుగ్మము నాశ్రయింపఁగాన్ (1-62)

iii. 'ధవుఁ డఱలేని కూర్మి జవదాటక నీపలు కాదరింపఁగా' (1-62)

iv. 'అలరుంబోఁడుల లోపల నలరుం బోఁడుములు నీకు' (1-64)

v. '......నీ యెడం గలుగు గారవ మెయ్యెడఁ జూచి కాన, (1-65)

వంటి పలుకులు పైకి ఆశీస్సులవలె నున్నను సవతులకు సత్యభామపై అసూయను కలిగించుచున్నవి. అంతేగాదు. రుక్మిణితో......'లే కున్న ననర్ఘ్య దివ్య కుసుమోత్తమ మేరికినైన నిచ్చెనే?" అని అనుచు 'సత్య; యింతకున్ స్రుక్కకయున్నె?' అని యీామె యెదుట ఆమె పేరెత్తుట ఆమెను కోపమునకును ఈర్ష్యకును గుఱిచేయుటకే పనికివచ్చినది. ఇంతకు మించి కలహపారణ ముని పాత్రపోషణమున కేమి కావలెను?

పారిజాతము మహిమనే గాక, దానిని దాల్చిన రుక్మిణి మహిమల గూడ వర్ణించుట ముందే సత్యకు ఈర్ష్యావహము. తన్ను పేరుపెట్టి నిందించుట ఆమెకు మఱియు ఆగ్రహ హేతువు ఇట్లు ఒక్క పద్యములోనే సత్యాదూషణము, రుక్మిణీ భూషణము, కలహపోషణము. రసిక తోషణమును చేయఁగల్గుట ఒక తిమ్మనార్యునకే చెల్లినది.

ముందే మాధుర్య ధుర్యము; అందును వ్యంగ్యములు ప్రతీతములు; ఇందువలననే నంది తిమ్మనది మరంద నిష్యంది కవిత యనుట.

'అమ్మ తెచ్చిన విద్వాంసుఁడైన తిమ్మనార్యు'నకు స్త్రీ జనోచితము లగు కోపాగ్రహములు, అసూయావేశములు, స్పర్ధా ద్వేషములును బహు పరిచితములై యుండును; లేనిచో పద్యమునం దింత నిండుదనమును నింపలేఁడు.

## 10

అతులమహానుభావ మని యవ్విరిఁ దా నొక పెద్ద సేసి య
చ్యుతునకు నిచ్చకం బొదవ సూడిద యిచ్చిన నిచ్చెఁగాక, తా
నతఁడు ప్రియంబు గల్గునెడ కర్పణ సేసినఁజేసెఁగాక, యా
మతకరి వేలుపుందపసి మమ్ముఁ దలంపఁగ నేల యచ్చటన్.

[అ 1-ప 84]

రుక్మిణీ సౌధములో జరిగిన వృత్తాంతము సత్యకు తెలియుటలో "పారిజాతాపహరణ"నాటకములో ద్వితీయాంకము ప్రారంభమైనది. ప్రకృతిచే సత్యావధూటి మానిని; స్వాభిమానమువలన ఆత్మస్తుతిపరాయణురా లగుట వంటి పనులు చేయునది; దానికితోడు ప్రియుఁడు అన్యవనితాసక్తుండై అకార్యము లేమైన చేసేనేమో అని అపశకునములనుబట్టి అనుమానించు స్వభావము గలది. ఇట్టి ఆమెకు చెలి వచ్చి పారిజాత పుష్పచరిత్ర యంఁతయు విన్నవించెను. దానితో నామె మండిపడినది; కోప భయ యీర్ష్యాదుఃఖములు ముంచుకొని వచ్చినవి; కలహాశనుని ప్రలాపములను, వానిని ఆగోపికావల్లభుఁ డాదరమేదురుఁడై వినుటయు, తన చెలికత్తె మోమోటముచే రుక్మిణీ సతిమాటలనిక్కమును దాఁపఁజూచుటయు, ఆమె ఆత్మాభిమానమును మేలుకొలిపినవి. అందుచే నామె సాధారణమైన ఆపుష్పమును మహామహిమాన్విత మని ఒక అనర్ఘ వస్తువుగా నారదుఁడు వర్ణించె నన్నది; శ్రీకృష్ణునకు ఆకుసుమమును కానుకగా నిచ్చుట వట్టి యిచ్చక మన్నది; కృష్ణుడు ఆపుష్పమును రుక్మిణి కిచ్చుట కేవలము అర్పణము చేయుట (తెలివితక్కువగా అయోగ్యురాలికి ధారాదత్తముచేయుట) అన్నది కోపేర్ష్యాదులిట్లు ఆమెచే పలికించి, "మమ్ముఁ దలఁపఁగ నేల యచ్చటన్"అని ఆత్మాభిమానమును అతిరేకింపఁజేసినవి.

"ఒక పెద్దచేసి"అనఁగా "ఒక ఘనమైన దానినిగా వర్ణించి" యని హేళన. "ఒక" అను పదము తెలుఁగులో అనిర్దిష్ట నిర్దిష్టార్థములు రెంటినిమాత్రమేగాక అలక్ష్య భావసూచకార్థమునుగూడ నీయఁగలదు. అందుచే "ఒక" అను పద మిచ్చట వక్త్రి లక్ష్యభావ వ్యంజకము.

కేవలము శ్రీకృష్ణుని ముఖస్తుతులవలని ప్రీతిచే నారదుఁడు ఆకానుక నిచ్చె ననునది, "యిచ్చక" మను పదమందలి వ్యంజనసామర్థ్యము, 'ఇచ్చెఁగాక;' అనుటలో ఆత్మసమాశ్వాసము సూచ్య మగును. తన్మూలమున తన కేమియు చింతలేదని ఆమె భావము.

ఇచ్చట 'రుక్మిణి' అని యనకఁ ప్రియంబు గల్గునెడకు' అని సత్యాదేవి పలుకుట యీర్ష్యాతిరేక జనిత సపత్నీనామోచ్చారణా నిష్టమును వ్యంజించుచున్నది. 'ఎక్కడ ప్రేమగలదో అక్కడ నిచ్చుకొన నిమ్మ' అనుట స్త్రీ జనసహజము. స్త్రీలు సవతిపోరు వలని అసహనముచే ఆమెపేరుసైతమునోట పంటఁబట్టి పలుకరు.

నారదుఁని 'మతకరి వేలుపుం దపసి' అనుటవలన సత్యభామకోపము వితతముగ ప్రతీత మగుట గమ్యము.

"పలుదెఱఁగు ముళ్లమాటలఁ
గలహమె కల్యాణ మని జగంబులవెంటన్
మెలఁగెడుమౌనికి సహజము
వల దని వారింపవలదె వల్లభుఁ డతనిన్" (పారి-1-85)

సత్య, నారదుని నింద నుద్దేశించి ఆ కోపాతిశయముతో నిందాస్తుతికూడ చేసినది.

"నన్నుఁ దలంపఁగ నేల? అనక, "మమ్ము దలంపఁగ నేల" అనుట గర్వాభి మానముల సూచకము; సర్వస్త్రీజనభిన్న మగు స్వాతిశయారోపము,

ఇంతకు నారదుఁడు కృష్ణునకు పుష్పప్రదానముచేసిన చేయవచ్చునఁట;ఆకృష్ణుడు దానిని ఎవ్వరికైన సమర్పించుకొనవచ్చు నఁట; తనకు ఈరెండు కార్యముల విషయము నను అభ్యంతరము అంతగా లేదని సత్యభామ తన్నుఁ దా నోదార్చుకొనును. మఱి ఆమెను బంధించు నభ్యంతర మేది? రుక్మిణీ సౌధములో తన పేరు తలఁపఁబడుటయే అభ్యంతరము, సత్యభామ యనఁగా, అసూయాదురభిమానములకు సరసీమ,

వనితా జనతా కలహ కారణములను, అందును అంతఃపుర సపత్నీ మాత్సర్యము లను వర్ణించుటలో తిమ్మనార్యుఁడు తిరుగులేనిచేయి. ఆనాఁడు రాజప్రాసాదప్రవేశ పరిచయము లెందఱి కవులకు లేవు? అందఱును నారీలోక మనస్తత్త్వ నిరూపణ నిపుణు లైనారా? అది కొంత నిశిత పరిశీలనా సామర్థ్య మందును కవిప్రవృత్తియందును కూడ ఉండును. అందుచే పారిజాతాపహరణ కథావరణ మనఁగా కవి ప్రవృత్తికి అనుగుణ మైన యితివృత్త స్వీకృతి. నిర్దిష్ట ప్రయోజనముగల కావ్యరచనవలన యశస్సు లభింప దనెడి బాధ తిమ్మన కవీంద్రునకు లేవు. అతఁ డంత యశఃప్రార్థి కాఁడు. కానిచో, కేవల పురాణేతివృత్తములను స్వీకరించునా? శివాగమశీలి యయ్యును విష్ణుపరమైనకథను కూర్చుటలోగల ఔదార్యము అతని 'అభేదబుద్ధికి' తార్కాణముకాదా?

తిమ్మనార్యుఁడు స్వయముగ కొంత సిగ్గరియో, చిత్తప్రశాంతకరములగు ప్రదేశములందు నివసించు ఐకాంతిక శివభక్తుఁడో అయియుండవలెను, కీర్తికండూతి కూడ ఇతనికి ఇతరులకంటె తక్కువయో, అనిపించుచున్నది. లేనిచో, అద్వితీయుఁ డయ్యును రాయల ఆస్థానియందు ద్వితీయుఁడై, రావలసినంత యశస్సు రాకపోయినను నిత్యసంతుష్టుడై నిశ్చింతుఁడై యుండునా?

అంత ఐకాంతికభక్తుఁడైనచో, ఇష్టానిష్టోపపత్తులయందు సమచిత్తుఁడైనచో, కృష్ణరాయలను అంతఃపుర ప్రసాదన విషయమున ప్రబోధింపనేల? అనుట తిమ్మ నార్యుని కరుణరసప్రవృత్తికి అన్యాయముసేయుట; అతఁడు రసప్రతీపతరణము (ఎదు రీదుట) చెయలేదేమీ? అనుట.

మొత్తముమీఁద స్వాభిమానాతిశయ సముచితమైన యీ పద్యమే,—
"ఏవనితల్ మముం దలఁప నేమిపనో తమ రాడువారు గా
రో? వలపించు నేర్పెఱుగరో? తమ కౌఁగిలిలోన నుండఁగా,
'రా విదియేమిరా? విజయరాఘవ' యం చిలుదూరి బిల్మమై
తీవరకత్తెనై పెనఁగి తీసుకవచ్చితినో? తలోదరీ!"
వంటి పద్యములకు శ్రీకారము చుట్టిన దనుట, మిధ్య గాఁజాలదు.

## 11

ధన మిచ్చి పుచ్చుకొన్నను
మనమున నోర్వంగ వచ్చు మగఁ డింతులకున్
జన విచ్చి పుచ్చుకొన్నను
మన వచ్చునె? యింక నేటిమాటలు చెలియా! [పారి,ఆ1-ప97]

శ్రీకృష్ణుడు రుక్మిణికి పారిజాత ప్రసూన మిచ్చిన కారణముచే సత్యభామ తనకు పతి యిచ్చినవచనవును తిరిగిపుచ్చుకొనినట్లే భావించుచున్నది. ఈమెను అభిమానధన యనుట లెస్స.

ఇందు నాయికయగు సత్య పతి తిరస్కారమువలనఁ బుట్టిన విషయద్వేష పరమగు చిత్తవృత్తిని ప్రకరణాది వశమున ప్రధానముగ అనుభవించుచున్నది. దీనికే 'నిర్వేద'మని నామాంతరము. అయినను ఇందు నిర్వేదసామగ్రిచేతనే అమర్షముకూడ అల్పముగ వ్యజ్యమానము కాఁగలదు. రసమువలెనే భావముకూడ విభావానుభావముచే వ్యజమానము కావలెను. ఇచ్చట నట్లే జరుగుతున్నది. కావున నిందు భావధ్వని యేర్పడెను. కాఁగా, అల్ప విభావమువలన అపరిపుష్టమైన కారణముచే నిందలి సంచారి కేవలము భావమాత్రముగ మిగిలిపోయి రస స్ఫుట ప్రతీతి నొందఁ జాలకున్నది. లేదా పొందియు తద్రస ప్రతీతి, చమత్కారి కాఁజాల కున్నది. నత్యభామ యిచ్చట అవ స్థాంతర శబలిత నుగు చింతలో నిమగ్నురా లయ్యెను. చందనవృక్ష కోటరములోనికి దూసికొనిపోవు నాగుబామువలె నింతలో సత్యామానిని కోపగృహము లోనికి దూసికొని పోయినది.

స్త్రీపాత్ర చిత్రణ వైశిత్యమునందు తిమ్మకవికిఁ గల నైపుణ్యమున కీ పద్యము అభిదాంతరము; సుకుమారతా గుణమునకు అన్వాదేశము.

## 12

అంతటఁ బారిజాతకుసుమాగతనూతన దివ్యవాసనల్
వింతలుసేయఁ 'దావి యిది విస్మయ' మంచు ముసుంగుద్రోచి, య
క్కాంత గృహాంబు నల్గడలు గన్గొని సంభృతతాలవృంతునిం
గాంతునిఁ జూచి బాష్పకళికా తరళీకృత లోచనాంతయై.
[పారి-ఆ1-ప10]

పారిజాత పుష్ప వృత్తాంతము సత్యభామ కేచెలి చెప్పినను చెప్పవచ్చును; అందుచే కృష్ణుఁడు రుక్మిణియింట నిల్పోపఁడు. నాటకములో దృశ్యముమాఱినది. అతఁడు హుటాహుటిగా వచ్చిచూచెను గదా, సత్య, కోపసదనములో నుండెను. ఆమె తన్నెట్లైనను ధూర్తుఁ డనుకొననే అనుకొన్నది. కాన కృష్ణుఁ డిప్పుడు ఉపాయమును కాపట్యమును నెఱపియే యీ పరిస్థితి నెదుర్కొనవలెను. శఠుఁ డెంతకైన సమర్థుఁడు;

ఒక చెలి చేతిలోని వీవన తీసికొని తానే సత్యకు వీవఁ దొడఁగెను; తన్ను అంటి వెంట వచ్చిన పారిజాత సుమ సౌరభము తాళవృంత సంచాలనమువలన గాలిలో బాగుగ కలసెను; ఏ కాంతగృహ మంతయు వ్యాపించెను. అపూర్వమైనది ఆ వాసన. దానికి సత్య ఆశ్చర్య మొందినది. 'ఎక్కడిది యీ వాసన' యనుకొని గృహము నల్గడలు పరికించినది. ఆమెకు విభుఁ డగపడెను. అతఁడు తనకు విసురుచున్నాఁడు. మొగ్గల వంటి కన్నీటి బిందువులచే నామె కనుతుదలు చంచలము లైనవి; కలఁత నొందినవి. తోడనే ఆమె మఱల ముసుఁగిడుకొని పరున్నది.

ఇందు బాష్పోదయము వర్ణితము. అశ్రువు, క్రోధ దుఃఖ ప్రహర్షములచే గలుగ వచ్చును. ప్రియతముఁడు సాపరాధుఁడు; ఐనను వచ్చి తన్ను ప్రసన్నురాలిని గావింపఁ జూచుచున్నాఁడు. వీచుట కారంభింపఁగనే సత్య కనులు విచ్చి చూచినది. ఇది సంచారి యైన హర్షము. పంచారించుట. ఇంతలోనే అసూయ; వెంటనే కోపము. వీనిఫలమే ముసుఁగిడి పరుండుట.

ఒక్కొక్కచో సంచారిచేతనే యీర్ష్యా విప్రలంభ శృంగార రసాభివ్యక్తి కలుగుచున్నట్లు తోఁచును. కాని అచ్చట ఉల్లిఖితములు కాకపోయినను స్వానుకూలము లను, స్వసముచితములును అయిన విభావాను భావాదులు ప్రకరణాదివలన సమాక్షిప్త ములు. ఏలన, విభావాది త్రితయ సంవలిత స్థాయిభావ విషయముగానే రసప్రతీతి. విభా వాదులలో ఒకటిగాని, రెండుగాని ఉన్నయెడల, అప్పటికప్పుడు వర్ణితేతరమును సమా క్షేపించుకొనవచ్చును. అది దోషము కాదు. విభావాదు లన్నియు సమప్రధానములై యున్నయెడల రసాస్వాదోత్కర్ష యుండును. ఒకటి రెండుమాత్రయే ప్రధానములై యున్నయెడల రసోత్కర్ష తగ్గును. ఇచ్చట కృష్ణ సాన్నిధ్యము విభావము; అశ్రూద యము అనుభావము. అందుచే ఈర్ష్యా విప్రలంభము ఆస్వాద్యమానము.

ఇట సత్య నాయిక; తన నాయకుఁడు రుక్మిణియందు ఆసక్తుఁ డయ్యెనని విన్నది. దానితో నీర్ష్యామానము కలిగెను. సామదానభేదోపాయములచేత నాయకుఁ డిప్పుడు ఆమెను ప్రసన్నురాలి నొనర్చుకొనుట యుక్తము లేదా, నమస్కారోపేక్షా రసాంతరములు కూడ కార్యకారులు. నాయకుఁడు కృష్ణుఁ దేమిచేయునో మునుముందు. చూడఁగలము.

## 13

పాటలగంధిచిత్తమునఁ బాటిలు శోకభరంబు దీర్ప నె
ప్పాటను పాటుగామి మృదుపల్లవకోమల తత్పద ద్వయీ

పాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నియ వెట్ట నాజగ
న్నాటకసూత్రధారి యదునందనుఁ డర్మిలి మ్రొక్కెఁ; మ్రొక్కినన్.

[పారి-ఆ1-ప120]

ఆమె అధరామృతమును ఆమె బాహుపరీరంభమును పొందుటకు తాను నోచుకొననిచో, ఆమె నిడువాలు కంటనైన తన్ను కృతార్థు నొనరింపవలెనని కృష్ణుఁడు సత్యను ప్రాధేయపడెను. సత్య లక్ష్యపెట్ట లేదు. అంతటితో ఆతని ఓర్పుకూడ తగ్గిపోయినది. అతఁ డామె పైఁటచెఱఁగు పట్టుకొనెను. వెంటనే సత్య కోపించినది; హస్తకమలముతో కొట్టఁబోయినట్లు బెదరించినది. కృష్ణున కామె కోపతీవ్రత వ్యక్తమయ్యెను. సత్య కోపాతిశయమును దీర్చుట తన శక్యము కాదని ఈపద్యములో కృష్ణుఁడు గ్రహించెను. సత్యాదేవిపట్టున సామదానభేదోపాయములు వ్యర్థము లైనవి. దండోపాయము అరసికత్వము; రసికులు ఆ జాడను పోరు. కృష్ణుఁ డిక నామె నెట్లు వశ మొనర్చుకొనవలెను ? ఒక్కటే ఉపాయము కలదు. అది సర్వత్ర సమ్మతము కూడ. వెంటనే నాయకుఁడు నాయికకు 'సాష్టాంగ పడినాఁడు,' అందులో నొక సుగుణ మున్నది. పల్లవముల వంటి (చిగురుటాకుల వంటి) ఆమె పల్లవములు (పాద లవములు) పాటల (ఎఱ్ఱని) కాంతి గలవి. తన శిరస్సునందలి మాణిక్యముల చాలునకు ఆమె మృదు పాద పాటల కాంతి వన్నె పెట్టఁ గలదు. అందుచే నతఁడు నమస్కరించెను. ఇది చక్కని నెపము; తనమౌళి మణులను శుభ్రపఱచుకొను క్రియ; పామరలోకుల దృష్టిలో నమస్కారము కాఁగూడదు గదా. మఱి అతని జగన్నాటక సూత్రధారి బిరుదము కూడ సార్థక మయ్యెను. 'భార్యకు ప్రణ మిల్లుట యేమి?' అని పామరలోకము అనవచ్చును. ఇది యంతయు నొక నాటకమని దాని కొక సమాధానము. లేదా, 'జగన్నాటకము కూడా అట్లే యున్నది; చూచుకొనుము' అని గద్దింపు.

గౌరవార్థము నమస్కరించుట లోకసాధారణము. ప్రణయార్థము నమస్కరించుట కావ్యలోక సాధారణము; శయనాగారలోకసాధారణము. 'ఎంత నేర్చినా-ఎంత చూచినా-ఎంతవారలైనా కాంతదాసులే' యనిన త్యాగరాజస్వామివారు క్రాంత దర్శులు.

సత్య, సహజముగ పాటలగంధి (పొగడపూవువాసనవంటి శరీర సౌరభము గలది); కృష్ణుఁ డిప్పుడు పారిజాతగంధవహుఁడు. ఇర్వురకును స్పర్థ యేర్పడెను; ఆమె కోపము భరమయ్యెను; కృష్ణుఁడు తాను జగన్నాటక సూత్రధారి; ఇట్లు నడిపించిననే గాని, యీ నాటకము చక్కఁబడ దని నేర్చి నటించినవాఁడు; జగన్నాటక మి

ట్లుండు ననియు తెలుప నిచ్చకలవాఁడు. ఇట్టి వానికి భార్యాపాదప్రణతి మార్యాదా నష్టము గాదు. ఇది కామశాస్త్రాభిమతము; అలంకారశాస్త్రానుమతము. వృద్ధుఁడగు దశరథుఁడే కైకేయీ కౌసల్యలకు ప్రాణమిల్లినట్లు వాల్మీకి మహర్షి చెప్పెను. ఇఁక, రసికుఁడగు శ్రీకృష్ణుని సంగతి చెప్పనేల? శకుంతలను దుష్యంతుఁడు ప్రణామము చేసినట్లు కవికులగురువు కాళిదాసు ప్రవచించెను. కార్యేషు దాసీ. కరణేషు మంత్రీ..." వంటి సూక్తులు మనము వినుచున్నాము. వేదములే భార్యను పెక్కువేళల మాతగా భావింపుమని భర్తకు చెప్పుచున్నట్లు తజ్ఞులు పలుకుదురు. నందితిమ్మన మరందనిష్యంది కవిత కీదృష్టి రససాధకమేగాని బాధకము కాఁజాలదు. స్వరోచిచే వివాహ సందర్భములో సన్నెకలు త్రొక్కించుచు భార్యా పాదాభివందనము చేయించిన పెద్ద నార్యునకు తిమ్మనార్యుని యీ పద్యము ఆచార్యకము నెఱపియుండును.

భగణ బాహుళ్యముగల ఉత్పలమాలావృత్తము సహజావరోహణత్వ భాసకమై యదునందనుఁడు అవనతుఁ డగుటను వ్యంజింపఁగలుగుచున్నది. గణవశముననేగాక, పదవశముననను ఈ యుత్పలమాల భగణప్రాచుర్యముగల దగుటవలన వినమ్రభావ వ్యంజకత్వము వితతము.

నాయికా కోపభరోపశమనము దుర్ఘట మగుటఁ యీ పద్యమందు వృత్తిచ్ఛేకాను ప్రాసములచే (పాటల, ప్రాటిలు, పాటను, బాటు) వ్యంజితము; పద్యమునందలి అయుగ్మశముల నొందిన ద్విప్రాసముకూడ (పాటల-పాటల) తద్విషయమునే వ్యంజించు చున్నది; పరుషాక్షర మగు 'ట' కార ప్రాస సైతము తద్విషయ వ్యంజకమై యున్నది. 'ట' వర్ణము వాయు బీజాక్షరము; 'మా-రుత బీజంబులు శోకవార్ధిఁ బడఁగాఁ ద్రోయు' నని శాస్త్రముకూడ. బహుధా భావవ్యంజక సామర్థ్యము గల యిందలి ఛందోఽలంకార శిల్పేందిర సుందరమైనది.

## 14

జలజాతాసన వాసవాది సుర పూజా భాజనం బై తన
ర్చు లతాంతాయుధుకన్నతండ్రిశిర మచ్చో వామపాదంబునం
దొలఁగం ద్రోచె లతాంగి;యట్ల యగు నాథుల్ నేరముల్ సేయఁ బే
రలుకం జెందినయట్టికాంత లుచితవ్యాపారముల్ నేర్తురే ?

(పారి-1-121)

శ్రీకృష్ణుడు ప్రేమతో తనకు మ్రొక్కినను అది సత్యకు బోధపడదు. ఆమె యీర్ష్యాకషాయిత; కోపన; మానక్రోధన; మ్రొక్కుచున్న తన పతిశిరము నామె వామ పాదముతో తొలఁగునట్లుగ త్రోసిపుచ్చుట యీ పద్యమున వర్ణితము.

బ్రహ్మేంద్రాదిసురలు నిత్యము విష్ణుని పూజింతురు.విష్ణు నవతారమే కృష్ణుఁడు. బ్రహ్మాదుల పూజలకు నిలయమైనది ఆతని శిరస్సు. ఇం కెట్టిది ? ఆ శిరస్సు లతాంతా యుధుని కన్న తండ్రిది కూడ.

శ్రీకృష్ణుని బ్రహ్మేంద్రాదులు పూజింతు రనుట, ఆతని మాహాత్మ్యమును చెప్పు టకు నిమిత్తము; లతాంతాయుధుని కన్నతండ్రి యనుట, ఆతని సౌకుమార్య సౌందర్య స్ఫూర్తులను చెప్పుటకు నిమిత్తము. అటు లోకాతీతమగు మాహాత్మ్య ముండియు, ఇటు అతిలోకములగు సౌందర్యాదు లుండియు కృష్ణుఁడు తన భార్యచే అట్లు పడినాఁడని ధ్వనితము. ఆపాటు ఎట్టిది? శిరము తొలఁగఁ ద్రోయఁబడుట; అందును కుడికాలైనఁ గాదు; ఎడమకాలు. ఇంతవఱకును మహాకవి వృత్తవిషయ కథనమును నిర్వర్తించెను

అట్ల యగు; లేదా-అట్ల యగు నాథుల్ నేరముల్ సేయ;—అనుటలో చమ త్కృతి గలదు. రాయలవారి కైన నేమి? కృష్ణునకైన నేమి? ఎవ్వరికైన అంత పనియు జరిగితీరు నను నది మహాకవి చేయు నిర్ణయము; చెప్పు తీర్పు. అగుచో, తిమ్మ నారుఁడు స్త్రీ ప్రపంచ పక్షమును వహించి వాదించుచున్నాఁడు. ప్రపంచములో సగము మందికి పైఁగా అఁకట్టుకొనుట కవిదైన లోకజ్ఞత. సత్యను చంకవెట్టుకొని పురుష ప్రపంచమున కొక హెచ్చరిక చేసినాఁడు; కాదు; దానిపై దాఁడియే చేసినాఁడు. మంచి పనియే చేసెను. తిమ్మన స్త్రీ పక్షపాతి; నిజమే! అది కవుల ధర్మము; బాధ్యతయు కూడ; బలహీనవర్గముల పక్షము నిం కెవ్వరు వహింతురు? కాఁబట్టి తిమ్మన వ్యక్తిత్వ మిచ్చట బైటఁపడినది.

కాని, యింతలో మన యాశలు నిరాశలు చేసినాఁడే, కవి! 'పే రలుకం జెందిన యట్టికాంత లుచిత వ్యాపారముల్ నేర్తురే?' కోపమువచ్చిన స్త్రీలకు బుద్ధి పూర్వానుస్వార మగునని రాయలవారి కేమి, కృష్ణున కేమి, పురుషప్రపంచమునకే తెలియవలదా? అని మహాకవి, మధురకవి మనలనే మందలించుచున్నాఁ డేల? స్త్రీ ప్రపంచపక్షపాతి యని యీతనిని గూర్చి మనము చేసిన నిదానము వట్టి నిస్సార మైనదేనా? స్త్రీలను గురించి యుదారముగ భావించుట పురుషుల బుద్ధిహీనత యనుట పురుషుల నిందించుటయా? భంగ్యంతరముగ స్త్రీలను నిదించుటయా? చెప్పలేము. కవి వ్యక్తిత్వమును గుఱించిన

మన నిదాన మంతయు తప్పేనా ? అతని వ్యక్తిత్వమును చిక్కించుకొనలేకపోయితి మన్నమాట. అతఁ డెవ్వరియందును పక్షపాతి కాఁడా? అనఁగా నతఁడు తన కవితలోను పూర్తిగా చిక్కఁడు; సంసారబంధములలోను చిక్కుపడఁడు. స్వయముగ నిర్లిప్తుఁడు నిర్మముఁడు; నిరీహుఁడు; నిస్సంగుఁడు. ఇది యాతనిని గూర్చిన సరియైన నిదానము. కడమ దంతయు మనము రేఁపుకొనిన దుమారమే! పోనిండు.

ఈ పద్యము వినఁగానె హాస్యరసప్రియుడైన రాయలకు సెలవులు వార నవ్వు వచ్చియుండును. పిమ్మట దీనిని మననముచేసికొని మందహాసాంచితనేత్రుఁడై యతఁడు తిరిగి తిరుమలదేవి సౌధమునకుఁ బోవ నిశ్చయించుకొనియుండును.

ఇంతకు, 'తొలఁగఁద్రోయుట' తన్నుటయా ? సత్య, తనకు నమస్కరింప వల దని పతిని నివారించుటలో జరిగిన ప్రమాదమేమో, అది. "అట్ల యగు" నని దానిని తిమ్మన తాఁపుగానే వక్కాణించుచున్నాడు. కృష్ణుఁడును 'తాఁచినయది నాకు మన్న నయ'(ప.123)యని పలుకుచున్నాఁడు. అగుచో, ఆతాఁపు దోషమా? కాదా? ధర్మమా? అధర్మమా? దోషాదోష నిర్ణయమును, ధర్మాధర్మ నిర్ణయమును ప్రధానముగ న్యాయస్థానములు, నిర్వహింపవలసిన ధర్మములు, కావ్యధర్మములు గావు. సుందరతాసుందరతల నిర్ణయము కావ్యధర్మము. ఒకవేళ పాదస్పర్శ, దోషమే అయినను దానివలన బాధపడ వలసినవాఁడు కృష్ణుఁడు. అతఁడు దానిని పట్టించుకొననే లేదు. అది తనకు 'మన్ననయే' అని కూడ పలికెను. అతనికి లేనిబాధ మన కేల ?

'అతనికి లేనిబాధ మన కేల ?' అనుట విమర్శ కాదేమో। కనుక దానిని గూర్చి చర్చింపవలెను. అసలు అది నిజముగ దోషమా ? లేక-పతిచేసిన దోషమునకు దండనయా? దండనము దోషముకాదు గదా! పైఁగా, ఆమెను తిమ్మన 'లతాంగి;' యనెను అసలే లతాంగి. అందులో వామ పాద పల్లవ తాడనము. అది మోపుగా నుండునా? లేక పోయినను తన్నుట తన్నుటయే! పోనిము. అది దోషమ్ము కాదు; దండన మన్నచో, భర్తను భార్య దండింపవచ్చునా! మఱి దాంపత్య విఘటన దోషమునకు పురుషు నెవ్వరు దండింతురు ? అది భార్యకు కర్తవ్యము గాదా?

సరే, బాగున్నది కాని, యిట్టి దాంపత్యము నిల్చునా? ఆఁ; నిల్చుటేగాదు; వర్ధిల్లును అది యెట్లు? కావ్యము, జగత్తు, అని రెం డున్నవి. కావ్య మెంత జగత్ప్రతిబింబ మైనను బింబము బింబమే. ప్రతిబింబము ప్రతిబింబమే! జగత్తులో భార్యాభర్తల మధ్య పాద తాడనము జరిగినచో, అది న్యాయస్థానముల కెక్కును; చివరకు దాంపత్య విఘటకము

కావచ్చును కూడ కృష్ణరాయల విషయమున నట్లే జరిగిన దందురు. కాని, కావ్యమున దైనచో, నది సత్యాకృష్ణుల మధ్య జరిగినట్లే జరిగి దాంపత్య సంఘటనకు దారితీయును వారి బిగి కౌఁగిళుల నడుమ దుర్విమర్శనలు నలిగిపోఁగలవు. శ్రీకృష్ణుఁ డుద్దీపిత మన్మఁ రాజ్య ప్రాపితుఁ డైనాఁడు. కావ్య నిరంతర చింతా రసికుఁడగు రాయల విషయమునన దుర్విమర్శనలు నశించుట తిమ్మనార్య నాశయము. ఇంతకు, పాదతాడనము రసోల్బ హేతువే యనునది ఉపపత్తి మన్నిష్కర్ష. కోపనలకును మానక్రోధనలకును పతుఁ నట్టిచేయుట నైజము, అది ప్రేమ లేకకాదు; ప్రేమాతిశయ ముండుటవలననే ఆరీతిగ జరుగును. దీనివలన నాయిక కపకర్ష కలుగదు; ఉత్కర్షయే కలుగును. కావ్యరసమ బాధితము కాదు; సాధితమే! వాత్స్యాయన మహర్షి కామసూత్రములును వానికిఁగల జయమంగళుని వ్యాఖ్యయు నిట్టివానిని సమర్థించినవి. గురుమానముచే కోపించిన నాయికకు పాదప్రణామమే అనునయ ప్రకార మనుట సర్వాలంకారిక సమ్మతి గలది. ఇచ్చట సత్యభామ ఈర్ష్యా గురుమానవతి. 'మాన' మనఁగా, 'ప్రియునిచే ప్రేయసికి, పాదపతనాది పూజ చేయించునది' అని భోజుని సరస్వతీకంఠా భరణ నిర్వచనము.

సత్యాదేవి నిచ్చట తిమ్మనార్యుఁడు అధీరా ప్రగల్భా నాయికగా చిత్రించినాఁడు రసాలంకార మర్మజ్ఞులు పాదతాడనమును రసపోషక మనకమానరు. పూర్వపద మునఁ జెప్పిన వాల్మీకి మహర్షి ప్రోక్తములగు నుదాహరణములును, కవిలోక శిఖామణి కాళిదాస ప్రోక్త మగు నుదాహరణమును, అమరుక మహా కావ్యాదుల వర్ణనములును సరసకవితా నిర్మాత యగు తిమ్మనార్యుని యీపద్యమునకు బాసటగా నిల్వఁగలవు.

'లతాంతాయుధు కన్నతంద్రిశిరము' అను సమాసములోని మిశ్ర శబ్దదాంపత్య వైచిత్ర్యము, 'వామపాదంబునం దొలఁగం ద్రోయు వైచిత్ర్యమునకు వ్యంజకమై యున్నట్లు భావికభావులు గ్రహింపఁగలరు. ఇది అనల్ప వ్యాకరణ శిల్పము.

ద్వితీయపాదములో ప్రాసస్థానమందు పదముయొక్క విఱుపు (ఁర్చు-లతాంతా యుధు) కృష్ణుని శిరము తొలఁగఁ ద్రోయఁబడుటనే గాక, పద్యగత సర్వవిధ ద్వైవిధ్య ములను వ్యంజించు భగ్నధ్వని. ఇందువలన నది సుందర ఛందశ్శిల్పేందిర.

సౌందర్యవతిగావున సత్యభామను 'వామ' యనుట యుక్తము. 'వామపాదము' షష్ఠీతత్పురుష మనియు చమత్కరింపవచ్చు. కాని, యది కర్మధారయమే! 'వామ పాద మనఁగా. 'అందమైన పాదము, ఇంపైన పాదము. కావుననే కృష్ణుఁడు 'చెల్వగు నీ పద పల్లవంబు' (ఆ 1-128) అనినాఁడు. అందమైన పాద మనఁగ, 'అందముగ

వక్రింపఁజేయఁబడిన పాదము' అని చెప్పుకొనవలెను. 'కృష్ణావతారములో వామపాద తాడనము కూడ' సహించినవాఁడవు; ఈ యవతారములో ఈమాత్రము సహింపరాదా? అని గాని, 'కృష్ణునంతటివాని కింతకంటె నెక్కువ మన్నన జరిగినది; నీకు జరిగినది సాధారణ మైనదే గదా।' అని గాని ఆకూతము గావచ్చును; వస్తుధ్వని కావచ్చును.

'తొలఁగఁ ద్రోచుట' తన్నుట కాదు; అందులో భర్త ఎడమవైపునకు వచ్చిన పుడు, భార్య కుడికా లెట్లు తగులును? అందుచే నిచ్చట వామ దక్షిణ పాదముల వ్యత్యాసమువలన నిందార్హత పెరిఁగి తరుగదు;' అని కొందఱివాదము కాని, యిట్టి సమర్థనలు నిల్వవు. మహాకవియే 'కోపన పద హతి' అనినాఁడుగదా ; ఏదైననేమి? అది శృంగార రస రాజ్యము నేలించు పదహతి. మొత్తముమీఁద రాయల సంసారము కుదుటపడినది. తిమ్మనార్యుడు కృతకృత్యుఁడైనాఁడు. అందువలననే యావత్పారిజాతా పహరణ ప్రబంధమునకును ఈ పద్యము శిఖరాయమాన మయ్యెను.

## 15

నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁ బూని తాఁ
చినయది నాకు మన్ననయ; చెల్వగు నీపదపల్లవంబు మ
త్తను పులకాగ్ర కంటక వితానము దాఁకిన నొచ్చు నంచు నే
ననియెద; నల్క మానవుగదా యిఁకనైన నరాళకుంతలా!

[పారి-ఆ1-ప123]

సత్య ప్రసన్నురాలు గావలెను. ఇప్పుడు కృష్ణుఁడు తత్కార్యాపేక్షాపరుఁడు. ఆమె పాదతాడనమువలన నతఁడు పులకితగాత్రుఁ డయ్యెను; మన్మథరాజ్యపట్టభద్రుఁ డయ్యెను. రసికతాధికతా సుఖతలే యాతనికి ప్రధానములు; వట్టి బింకములును మూఁతి బిగింపులును గావు. ఆమె పాదము సోఁకఁగనే 'నీదాసుఁడ'ననెను. ఇది నేరము నొప్పుకొనుట, 'నాయందు నీది నెయ్యమువలని కోపమేగాని, కయ్యమువలని కోపము గాదు' అనినాడు. నిజమే! తనయం దామెకు విరోధము లేదని అతఁ డెఱుఁగుట ముఖ్యము. అది ఆమె శోభను గ్రహించుట; ఆమెయందు సానుభూతిపరుఁ డగుట కృష్ణుని రసికత కది నిదర్శనము. తన్నుట నతఁడు తనకు మన్ననయే యనినాఁడు. భర్తృ కృత పాదవందనము భార్యకు పూజ యైనప్పుడు, భార్యాకృత పాదతాడనము భర్తకు సమ్మానము కాకుండునా? ఈ ఒరవు కృష్ణుని రసికతాభివ్యంజకము; దురభిమానులకు ఒరవడి.

ఆమె పాదము పల్లవము. చిగురాకు చెలువై యుండుట సహజము. అది పరి మృదువుగదా! అతఁడు తన శరీరమునందు తోఁచిన రోమాంచమును ముళ్లకంప యని నాడు. చిగురాకునకును ముండ్లకంపకును గల సంబంధము 'గోకులాష్టమికిని పీరు సాహేబునకును గల సంబంధము' వంటిది. తన పులకాగ్రములు ఆమె పాదమును నొవ్వఁజేయునని శృంగార నాయకుని భావము. నాయికపాదము, నాయకుని గగుర్పాటునకు అల్పముగ సోఁకెనేగాని శరీరమునకు సోఁకలే దన్నమాట. కేశలేశము, విశ్లథ కేశపాశమై యున్నను, కబరీ నిబరీస కుసుమ గంధము పరిమ్లానమై యున్నను ఆమెను జూచి కృష్ణుఁడు అరాళకుంతలా! యనినాఁడు. 'నీ కుంతలము లెంత వక్రములో నీ స్వభావముకూడ నంత వక్రమే' యని యిందలి ధ్వని పద్యమంతయు సాత్త్వికానుభూతి నొందిన నాయక పరముగ మోహాతిశయ వ్యంజకము. నాయికా పాద తాడితుఁడయ్యును నాయకుఁడు ఇట్లు పలుకుట నాయకోత్కర్షకే కారణ మని 'సాహిత్యదర్పణా ద్యలంకార శాస్త్రముల యుద్బోధ. పండితులీ పద్యము నించుమించుగ:-

దాసే కృతాగసి భవత్యుచితః ప్రభూణాం
పాద ప్రహార ఇతి సుందరి నాస్మి దూయే,
ఉద్యత్కఠోర పులకాంకుర కంటకాగ్రై
ర్యద్భిద్యతే మృదుపదం నను సా వ్యథా మే."

అను సాహిత్యదర్పణ శ్లోకమున కనువాదమే యందురు.

పాదాభివందనముచేయు పతియొక్క శిరమును ఆమె తన వామపాదముతో త్రోచునప్పటి సంరంభ విజృంభణములో సైతము తత్పాదము పతి పులకాగ్ర కంటక స్పర్శమే గాని, తనుస్పర్శము గాదని గమనింపవలెను. శరీరదమ్నము గాదని యూహింపవలెను, ఇఁక 'నెయ్యపుఁగిన్క' గాక మఱి యదేమి?

'నెయ్యము'లోని ద్విత్వాక్షరము, సత్యాదేవి ప్రేముడిలోని లోఁతులను, 'కిన్క' లోని సంయుక్తాక్షరము, ఆమె కోప ప్రదర్శనములోని అల్పత్వమును వ్యజ్యమాన మొనర్పఁగల్గుట యక్షరశిల్పము.

"నను - సుని - బున - బూని - చిన - న్నన - కిన - నైన" వంటి అక్షర నివేశమున 'న' వర్ణావృత్తి మార్దవ లాలిత్య వ్యంజకమై, నాయకోద్దిష్ట ప్రయోజన సాధక మగుటయు నక్షరశిల్పవిశేషమే!

'నీకుఁగలుగు బాధనుగూడ నీ వెఱుఁగవు' అని, నాయికదైన అమాయకత్వము నందు సానుభూతిపరుఁ డగునట్లు తోఁచుచున్నను తన పులకాది సాత్త్వికభావోదయ వర్ణనా పరముగ నిచ్చట నాయకుఁడు ప్రకాశముచేయునది, ఆత్మానురక్తియే యని మనము గ్రహించుట యుక్తము.

సత్యా దర్శన జన్యమగు అనురాగాది చిత్తవృత్తులు విభావాది (రత్యాది) తన్మ యీభవన రూపమునొంది కృష్ణుని పరముగ సాత్త్వికభావము లైనవి. విభావముచే నుత్తేజితమైన రతి, సంచారులచే పరిపుష్టమై సాత్త్విక మను అవాంతర స్థితినొంది పిమ్మట కృష్ణునియందు రసిత్వము నొందును. ఇట్టి రసిత్వ మొందిన కుహనా గోపాల తత్త్వము, కృష్ణరాయల తత్త్వము కావలె నని తిమ్మనార్యుని ఆశయము. మహాకవ్యాశ యము సిద్ధించె ననియే యైతిహ్య ప్రసిద్ధి. ఇం దెట్టి ఆశంకయు నుండఁబోదు. తరు వాత రాయలు తాను 'సత్యావధూప్రీణనము'చెప్పుట తన ప్రసన్నతను తాను లోకము ముందు సమర్థించుకొనుట కనవచ్చునేమో!

## 16

ఈ నయగారపుంబ్రియము లీపస లీమొగమిచ్చుమాట లే
లా? నిను నమ్మియుండినఫలం బిదె తోడన కల్గెనాకు; నీ
యాన; సుమీ, ననుం జెనకి యాఱడి వెట్టిన నవ్వువారలం
గాన; వెఱుంగునే పసులకాఁపరి భావజమర్మకర్మముల్?(పారి-1-125)

గురుమానము (కోపాతిశయము) నాయిక యగు సత్యభామను అతికోపనఁగా, అరసిక కల్పగా నొనరించిన పట్టునందలి పద్య మిది. కోపనయైన యామె స్వరూపము.

అన విని మానినీతిలక మప్పుడు మే యఱ దోఁప నిక్కి పీ
డిన కచపంక్తిఁ బల్మఱు ముడిన్ వెడ దోపుచుఁ, బై చెఱంగు గ్ర
క్కునఁ జనుదోయిఁ జేర్చుచు, మొగంబున లేఁజెమ రంకురింప జం
కెన నెఱిచూపు చూచి పలికెం జలితాధరపల్లవాగ్రయై'. (పారి-1-124)

అను పద్యములో చిత్రింపఁబడెను. అందువలన ముందే కోపావేశముచే నామె శయ్యనుండి తన శరీరమును సగము నిక్కించియుంచిన దన్నమాట. ఈ సంభ్రమ పరవశత్వములో బంధురమైన క్రొమ్ముడినుండి కేశములు విడిపోవఁ జొచ్చినవి. వాని నామె వ్యర్థముగ కబరీబంధమున నిమిడ్చుచున్నది. అనఁగా నవి మఱల జారుచుండె నన్నమాట. కేశ ములను క్రొమ్ముడితో నుద్ధిచేయుటకు మాటిమాటికి ఉద్బాహ కావలెనుగదా! 'ఎప్పుడును

కేశముల సేవయేనా?' అను నట్లుగ అంతలో కొంగు జారెను. దానిని వెంటనే నవరించుకొనుచున్నది. క్రొమ్ముడితో కొంగు ఉద్ధవిడి. యీ ఉద్ధించుట రహఃకేళిలో తమ పరస్పర వైరమువలననేమో! తన దశావిశేషములను బట్టి నాయికకు మాత్రము ఈ శృంగార సామగ్రుల అంతస్స్పర్థ చికాకుఁ గలిగించెను. ఏ సాధనము కూడా కలిసిరాకపోవుటతో నామె కోపము ఇనుమడించినది. దానికితోడు పైసాధనములకు తన సేవాశ్రమ మెక్కువ యయ్యెను. లేఁజెమటలు పోసినవి; కోపము రోషముగా మాఱు చున్నది; పెదవులు వణఁకఁజొచ్చినవి; అప్పుడు అరసికవలె పతి నిరసమునకు ప్రారంభింపవలసి వచ్చెను.

కచ కుచ సేవాస్మృతి సర్వనారీ సహజమే యైనను (ఆముక్త-1-59) కుంచె కదలిక చేతనువలె "వెడ(వ్యర్థముగ) దోపుచు" 'చేర్చుచు' వంటి పద సన్నివేశముచే సంభ్రమముతో నాయిక యిటు నటు పడిన శ్రమను తిమ్మనార్యుఁడు బొమ్మగీపినట్లు చూపఁగలుగును. (పారి-ఆ 4-ప 58).

మన ప్రకృత పద్యమున కింత పూర్వరంగ రచన మున్నది. కృష్ణుఁడు తన మృదు ప్రియ వచనములచే గూఢవిప్రియకారి యగుచున్నాఁడని సత్యభామ యుద్దేశము, అందుచే 'శఠుడా!' యని నిందించి నట్లయ్యెను. 'నీ చాతుర్యములు నాయొద్ద కావు' అన్నది. చమత్కారివచనములు గలవాఁడ వనఁగా, 'పయోముఖ విషకుంభమ' వనుట. 'మొగమిచ్చమాటలు' కృష్ణుని కార్యసాధనప్రజ్ఞాద్యోతకములు. అనఁగా, 'పబ్బము గడపుకొను స్వార్థపరుఁడ' వనుట. 'నిన్ను నమ్మియుండినదానికి ఫలమే యీ యవమాన' మన్నది, ఆమె. సవతి ప్రాభవము సత్యకు అవమానకారణము గాక మఱేమి? ఇంతలో కృష్ణుఁ డామెను సమాశ్వాసించుటకై "అట్లనుకొన వలదు" అనుచు సమీపించియుండును. 'నీతోడుసుమా! నన్ను తాకినచో ఆఱడి యగును. ఆ యాఱడి చూచి నన్ను నిందించుచు పరిహసించు సవతులను కనుఁగొని నీవు సంతసించుటకు వారిచ్చట లేరుగదా! నన్ను గేలిచేసిన నీ కేమితీరును?' అన్నది. 'అసలు నన్నవమానించు సవతులనే నీవు తెలిసికొనవు కూడ' అనెను. 'ఆత్మాభిమానమే లేని పసులకాపరి తన భార్యాభిమానమును కాపాడునా? ఏం'" మ్మన్నది. (పశుపతియగు పరమాత్మకు ఒక్కరియందని అభిమాన ముండని మాట నిజమే!) కానిచో, నారదుఁ డామెను తక్కువచేయు చుండఁగా కృష్ణుఁడు చెవియొగ్గి యామాటలు వినుట తప్పుగాదా? అది యెవరి తప్పు? పరిస్థితుల తప్పు. కృష్ణుఁడు కృపణుఁ డగుచో. పరిస్థితికృపణుఁడు, బిబ్బోకవతియగు సత్యకు ఇది పరిస్థితుల కుట్ర యని తెలియునా? తన పతియే యంతకుఁ గారణ మని

నిందించును; అతనిని గ్రామ్యజనుఁ డనును; అరసికుఁ డనును. ఇది స్త్రీజన సహజము. స్త్రీజన నిరంతర సాన్నిధ్యమువలన వారి మనఃప్రవృత్తి చిత్రణ నైపుణ్యము నందు తిమ్మనార్యుడు సంకుతేతినచేయి యయ్యెను. అనాదియగు నీశ్వరుని శక్తి యగుట వలన ప్రకృతి అనాది. పురుషుడు కూడ తదంశ మగుటవలన అనాది. అట్లే, అనాది యగు అనేక పత్నీత్వాచార ప్రభావమువలన నంతఃపురాంగనలకు అసూయ ప్రకృతి సిద్ధము. తిమ్మనాది మహాకవుల జీవితములు కూడ తదాచార ప్రభావ పరిచింతనాంశము లగుటవలన వారికి తదంగనల అసూయను చిత్రించు సామర్థ్యము ప్రకృతిసిద్ధము,

ఈపద్యమునను తరువాతరెండు పద్యములయందును భగవత్పక్షమగు ఒకానొక అర్థవిశేషము కూడ స్ఫురించును. తన్మూలమున తిమ్మన తన 'యభేదభావము'ను వెల్లడించి వైష్ణవ మతాశ్రయుఁడగు రాయలను ప్రసన్నునిగాఁ జేసికొనియుండు ననవచ్చును.

రాయలవారు కూడ యాదవాన్వయమునందు జన్మించినారని చెప్పుచు, "ఎఱుం గునే పసుల కాపరి" అని సత్యచే కృష్ణుని అనిపించుటలో గల మర్మమేమో తిమ్మ నార్యునకే తెలియవలెను.

## 17

ఉవిద యెవ్వతె నోఁచియున్నదో యీస్యమం
    తకరత్న మింక నొందల ధరింప
నీరైవతకశైల చారుకూట విటంక
    కేలి కిం కెవ్వతె పాలుపడునొ
యెవ్వతె కబ్బునో యీవసంతారామ
    కర్పూర కదళికాగారవసతి
లీల నీమణిసౌధజాలకంబుల నిన్నుఁ
    గూడి యెవ్వతె వార్ధిఁజూడఁగలదొ
యకట నేఁ బెంప బెరిఁగిన శుకమయూర
శారికా బృంద మెవ్వతెఁ జేరు నొక్కొ
నన్ను నాతోడి సవతులు నగక మున్న
పంత మలరంగ నిన్ను మెప్పింతుఁ గాక.

(పారి-ఆ 1-ప 131)

ఇంతకు ముందే 'నీవలని బొంకులు మాచవి గావు'అని సత్య తన యభిమానా తిశయమును సూచించెను; అట్లే, 'వల్లవీకింకర' యని కృష్ణుని నిరశించుచు ఆతని గ్రామ్య వనితాసక్తిని, అరసికతను ద్యోతక మొనర్చెను; 'కల్లలమారిని నమ్మి గుట్టును కోల్పడితినని వగచినది; తనసౌధమునకు పతి వచ్చుట తన్ను ఎకసక్కెము చేయుటకే యని కూడ ఖిన్నురాలై నది; తన్ను మన్నించునట్టి అత్తగారి మొగము నికఁజూడలే నని దుఃఖించినది.

నాయకుఁడు నీదాసుఁడ ననినాఁడు ; 'తన్నుట మన్ననయే' అనినాఁడు. తన క్రోధమించుక సడలినను సత్య ప్రతిష్ఠకై ప్రాకులాడుట సహజము. ఈదుస్థితినుండి తెఱపిలో బడుట యెట్లు? హఠాత్తుగ పతితో 'నన్ను క్షమింపుడు'అన లేదు. అందుచే నాత్మస్తుతియుతములు, పరనిందాపరములు నగు మాటలు కొన్ని పలికెను.

ప్రకృతము ఈపద్యములో నిఁక సత్యభామ కోపము రోషములోనికి దిగజారినది. ఆమె తాను ఆత్మహత్యకు గడఁగుదు నని సూచించుచున్నది. తన యనంతరము వచ్చు భార్య యెవ్వతె స్యమంతకమును దాల్ప నోఁచుకున్నదో యనును; తన పతితో పర్వతాగ్ర విహారములకు ఎవ్వతె పాల్పడునో యనును; తన వసంతోద్యాన సౌధనివాస మిఁక నెవ్వతె కబ్బునో యనును. తన పతితో గలిసి ఆసౌధగవాక్షముల నుండి సముద్రము నుజూచు నానుకూల్య మెవ్వతెకు కల్గునో యనును; శుక మయూరాదుల పెంపకము విష యములో తాను పడిన శ్రమయొక్క ఫలము ఎవ్వతెకు దక్కునోయనును; తాను మరణించి పతిని సవతులను సంతోషపఱతు ననును.

తాను ప్రాణత్యాగము చేయుదు ననియు, రాబోవు భార్యతో సమస్తభోగములును వైభవములును అనుభవింపవచ్చు ననియు భార్యలు భర్తలను బెదిరించుట నైజము. అది యెంతయో సహజముగ నీపద్యములో చిత్రితము.

ఇందు సత్య 'నిర్వేద' మను సంచారిభావము ననుభవించుచున్నది. ఆలంబన భేదముచే నిరుతెఱఁగులైనది నిర్వేదము. అది నీచాశ్రయాదులచే ఆక్రోశాదులలోనికి దిగుట సాధారణ రూపము. ఇచట సత్యాపరముగ నధిక్షేపములోనికి దిగుట విశేష రూపము. తన ఊహలో పరసంపత్తి దర్శనము మున్నగువానివలన సత్య యిచ్చట దీనానన యగుచున్నది; జీవితవిషయద్వేష రూపమగు చిత్తవృత్తి విశేషము నను భవించుచున్నది.

విప్రలంభమునఁగలుగు దశావస్థలలో మరణోద్యోగము చివరిది. సత్యభామ యీర్ష్యామానమునకు అంతిమదశ యనఁదగు మరణోద్యోగములోనికి దిగె ననలేముగాని మరణవాంఛను వెలార్చె ననవచ్చును. సాధారణముగ భామినుల (అందకత్తెల)

క్రోధోపశమన దశావిశేషములలో నిట్టి బెదరింపులు భావ్యములు. తమ భాగ్య భోగ్యముల స్మృతులు అదమ్యములు.

మధురకవి తిమ్మన నిర్మించిన స్త్రీప్రకృతి చిత్రముతోపాటు భౌతిక ప్రకృతి చిత్రమునకును ఈపద్యము భర్మ పంజరము. భావన మొనలుదేరి ప్రకృతివర్ణనయై పలుకరింపగా, తిమ్మకవీంద్రుని ప్రతిభ, చనవు లిచ్చి యీ సీసమును శిల్పించెను.

## 18

ఈసునఁబుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభు కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీ సఖమైన మోముపయిఁ జేల చెఱంగిడి బాల పల్లవ
గ్రాస కషాయకంఠ కలకంఠ వధూ కల కాకలీధ్వనిన్.

(పారి-1-133)

సత్యభామ నొక దవానలము దరికొన్నది. అది శోక మనెడి దవానలము. ఈ పెనుచిచ్చునకు కారణము ఈర్ష్య. ఈర్ష్యచే హెచ్చైన చిచ్చు సత్యను తప్త మొనర్చి బాధించెను. లేఁతచిగుళ్ళను మెక్కుటచే రంజకమై గొంతు విడిన ఆఁడుకోయిల కుహూ కృతిని తలఁపించుచు సత్య యేడ్చినది. వారేమిచేసినను వీరికందముగా నుండుటవలన స్త్రీలయేడ్పులోకూడ ఆనంద మున్న దనుట పురుషులకు పరిపాటి యయ్యెను.

ఈ పద్యమునకు ముందు 'వైస్వర్య' మిట్లు వర్ణితము:—

'నను నెవ్వతిఁగాఁ జూచితి
వని యంతర్బాష్ప యగుచు నవనత ముఖియై
ఘనతర గద్గదికా ని
స్వనమున మఱి మాటలాడ శక్యముగామిన్' [పారి-1-132]

ఆఁడువారలకు సహజమగు గర్వోక్తిని ముగించుచు సత్య, లోలోపలనే బాష్పము లడఁచుకొన్నది. వెలికిరాకుండ నడఁపఁబడిన బాష్పములవలన స్వరభంగము గల్గును. అదియే విస్వరత్వము; గద్గదిక. తరువాత నిఁక మాటరాదు.

పిమ్మట మన ప్రస్తుత పద్యములో సత్యభామ 'ప్రళయ'మను సాత్త్విక భావము నొందును. అత్యధికమైన దుఃఖముచే అచేతనురా లయ్యె నన్నమాట విరహ దుఃఖ

క్రోధాదుల అధిక్యముచే అశ్రువును కలిగెను. అంగనలు ప్రయోగింపఁగల అంతి మాస్త్రము పేరే, యేడుపు, దానిని యీ క్రింది విధమున విశ్లేషించి మనము ఆకళించు కొనవలెను.

సత్యభామగత రతి, రసీభావము నొందునప్పుడు ఈ సాత్త్వికములు అంతరాళ దశగా తోడ్పడినవి. ఇది బాహ్యమగు కేవలానుభావ ప్రళయయే కాదు; అంతరప్రళ యమునకు కార్యభూతముకూడ నైనది. చిత్తమున నుదయించిన ప్రళయమే సత్యకు శరీరమునందును ఉదయించెను, ఈ సాత్త్వికభావము, ఆంతరాళిక భావముల ప్రతి బింబమై రసీభావ మొందుచున్న సత్యాదేవిపరముగ రతినే సూచింపఁగలదు. ఇదే సాత్త్వికభావమున కిచ్చటఁ గల విశేష ప్రతిపత్తి.

ఈ పద్యమున వర్ణింపఁబడినది శోకమేయైనను అది కరుణమునకు స్థాయియైన శోకము కాదు. ఇచ్చట స్థాయి రతియే గురుమానముచే సత్యకుఁ గలిగిన అయోగము, పునర్యోగ పర్యవసాయి. ఇందు అనుభూత మగునది విప్రలంభమే. ఇది సంభోగ శృంగారమునకు పుష్టికరము.

ప్రబంధ ధోరణిలో ముందుగ నాయిక యేడ్పును వర్ణించినవాఁడు కవిసార్వ భౌముఁడు, శ్రీనాథుఁడు. అతని పద్యరూప కథానికా నాయిక, యనఁదగు కళావతి విలాపమిది-

'కొసరి వసంతకాలమున కోయిల క్రోల్చిన భంగి నేడ్చె న
బ్బిసరుహనేత్ర కొండదరి పెద్ద యెలుం గిడి వెక్కివెక్కి వె
క్కస మగు మన్యువేగమున కాటుకకన్నులనీరు సోనలై
ఉసిరికకాయ లంతలు పయోధరములో దిగువాఱుచుండగన్'-

(కాశీ-5-167)

మూలానుసరణముగా శ్రీనాథుని దమయంతీ విలాప మింకొకటి :-

సీ. '......................................

వేఁడి యశ్రులు నిగుడంగ వెక్కివెక్కి
యేడ్వఁ దొడఁగె లతాంగి పృథ్వీశు మ్రోల
మృదుల పరివేద నాక్ష లోన్మిశ్ర మధుర
కంఠ కాకు వికార కాకళిక యలర.' (శృం. నై. 4-87)

ఈపద్యములు తిమ్మనార్యు నాకర్షించి యుండును. స్వీయయు నిర్వ్యాకషాయితయు నగు సత్య"— ... ... ... ... ... ... ... ... ... పంకజ.

శ్రీ సఖమైన మోముపయిఁ జేల చెఱంగిడి బాలపల్లవ
గ్రాసిన కషాయకంఠ కలకంఠవధూ కలకాకలీ ధ్వనిన్"—

దుఃఖించినట్లు వర్ణింపఁ బడినది. ఏకాక్షర ద్వ్యక్షర పద్యములు చెప్పఁగల నంది మల్లయ్య ఘంట సింగయల కోవలోనివాఁడగు తిమ్మన కీపద్య మొక లెక్కయా? తిమ్మన వర్ణన పెద్దనార్యుని శ్రవోరంధ్రములలో గింగురు లెత్తెను. అతని వరూధిని మఱి ప్రౌఢగదా!

"పాటున కింతు లోర్తురె? కృపారహితాత్మక! నీవు త్రోవ ని
చ్చోటఁ భవన్నఖాంకురము సోఁకె కనుఁగొనుమంచుఁ జూపి న
ప్పాటలగంధి వేదన నెపంబిడి యేడ్చె కలస్వనంబుతో
మీటిన విచ్చు గుబ్బచనుమిట్టల నశ్రులు చిందువందగన్"

(మను-2-70)

ఇఁక తనపేరిట నొక వీణనే నెలకొల్పుకొని 'సంగీత కలా రహస్యనిధి' యైనవాఁడు, రామరాజ భూషణుఁడు. ఆతని గిరికకు వరూధిని యేడ్పు సంగతి తెలియుట కెంతసేపు పట్టును?

"ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల డాయన్ లేక రాకా నిశా
రాజశ్రీసఖ మైనమోమునఁ బటాగ్రం బొత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నర వధూరాజత్కరాంభోజ కాం
భోజీ మేళవిపంచికారవ సుధాపూరంబు తోరంబుగాన్—"

(వసు- 4-52)

వీరివీరి యేడ్పుల వర్ణనలను బట్టియే లోకమున ఈయాకవులకవితా తారతమ్య నిర్ణయము జరుగుచున్నట్లుగా, "ముక్కు తిమ్మన ముద్దు ముద్దుగ నేడ్చెను; అల్లసాని పెద్దన అల్లనల్లన యేడ్చెను; భట్టుమూర్తి బావురు మని యేడ్చెను" అని తెనాలి రామకృష్ణుఁ డొకనాఁడు రాయల వారితో పలికినట్టు పుక్కిటిపురాణములు వ్యాపించి నవి. మొత్తముమీఁద ప్రబంధకవులలో స్త్రీయేడ్పును వర్ణించుటయు పోటిపడని వారు లేరేమో అనిపించును.

సత్యను దీవించి కృష్ణునికడ సెలవుతీసికొని నారదుఁడు వెడలిపోయెను. ఇది ఆనాఁటి సాయంకాల వర్ణనము. ఒక దినములో జరిగిన కథ ముగిసెను.

ఒక మగతుమ్మెద, తన భార్యయైన ఆఁడుతుమ్మెదను పద్మమనెడి యింటిలో ఒంటిగా విడిచిపెట్టి యింకొక ఆఁడుతుమ్మెదతో విహరించి విహరించి సాయంకాలము నకు తన పూవుటిల్లు చేరుకొనెను. సాయంవేళ అగుటచే అప్పటికే ఆపూవుటిల్లు ముకుళించుకొని పోయినది. లోన ప్రవేశించుటకు వీలులేక యా మగతుమ్మెద తెల్ల వారు వఱకు సరోలక్ష్మికి చుట్టును తిరిగి తలవరివలె పరిచర్య చేసెను. పరిచర్య యెంత వ్యర్థమైనదో కదా!

కేవలము కల్పనాశక్తికి మాత్రమే యీపద్యము ప్రసిద్ధము గాదు. ఆమాటకు వచ్చినచో నీద్వితీయాశ్వాస మంతయు కవి కల్పనాశక్తికి ఉత్తమోదాహరణమే! ఇందు ప్రథమాశ్వాస కథావస్తుధ్వని కూడఁ గలదు. కృష్ణుని ప్రణయ వృత్తాంతమే కృష్ణ రాయలు ప్రణయ వృత్తాంత మైనప్పుడు కృష్ణరాయల ప్రణయ వృత్తాంతముకూడ నిందు ధ్వనిత మని వేరుగఁజెప్పుట పునరుక్తి.

## 22

సుర లోకాళి మత ప్రదాన సమతా సూయన్నృలెం గంస ఘ
స్మరుఁ డత్యుద్ధతిఁ బారిజాత ధరణీజాతంబు గోవర్ధనో
ద్ధరణ ప్రస్తుత మైనహ స్తమున నుత్పాటించి లీలాగతిన్
గరుడస్కంధము మీఁద నిల్పి నిలిపెం గౌతూహలం బింతికిన్.

(పారి- 4-53)

తనవలెనే కల్పవృక్షము కూడ దేవతల కోరిక లన్నిటినీ తీర్చుతున్న దనెడి యీర్ష్యచేతనేమో అన్నట్లు, శ్రీకృష్ణుఁడు కల్పకమును పెకలించి, గరుత్మంతుని మూఁపుపై నిడి, సత్యకు సంతోషము కలిగించెను. కంసు నంతటివానిని జంపినవానికి చెట్టు పెల్లగించుట యొక లెక్కకాదు. గోవర్ధనోద్ధరణము వలనఁ గలిగిన ప్రజా హితమే పారిజాతమువలనను కలుగునెడి స్ఫూర్తి యిం దున్నది.

## 23

వేల్పుఁబ్రమానియందు వేడుకవడు కూర్మి
సతుల కోర్కి దీర్పఁజాలి యపుడు
హరియు హరియుఁ బోరి రన్యోన్య జయకాంక్ష
నసుర జీవితాపహారులగములు.

(పారి-5-23)

అతఁడు (కృష్ణుఁడు) హరియే; ఇతఁడును (ఇంద్రుఁడును) హరియే; అతని భార్యకు కల్పవృక్షము కావలెను; ఇతని భార్యకును కల్పవృక్షము కావలెను. అతని బాణములును రాక్షస సంహారకములే! ఇతని బాణములును రాక్షససంహారకములే; సమానస్కంధుల మధ్య (సతుల వాంఛా సంసిద్ధి యను) నేకఫలాపేక్ష, అన్యోన్య జయకాంక్షను పెంచినది; కక్షకు దీక్షొనరించినది. రాక్షస సంహరణ దక్షులైనవారు అన్యోన్య సంహరణ కక్షా దీక్షితులైరి. భార్యల ఉదాత్త వాంఛా పరిపూర్తియందు అనుకూల నాయకుల అభినివేశ మెట్లుండునో, దానిని 'హరి' శబ్ద ద్విరుక్తి వలన మహాకవి వ్యంజింపఁ జేయుచున్నాఁడు.

## 24

సతులు పదాఱువేవురును సంగడి రా వదనాంబుజంబునన్
గృతకవికాస మచ్చుపడఁ గృష్ణుని పట్టపుదేవి యిందిరా
ప్రతినిధి రుక్మిణీరమణి రాఁ దగ వౌ నని వచ్చెఁ బుణ్యక
వ్రతము గనుంగొనం గమలరాగమణీ శిబికాదిరూఢయై.

(పారి-5-74)

పారిజాత వృతమును సంపాదించిన మహిమాతిశయము కనుగుణముగ నారద ప్రేరణముచే సత్యాదేవి పుణ్యకవ్రతము సేయ సంకల్పించెను.

ఆవ్రతము చూచుటకై రుక్మిణీదేవి వచ్చుచున్నది. పట్టమహిషియైన ఆమె ముందు; కృష్ణుని యితరభార్యలు పదాఱువేలమంది ఆమె వెనుక. రుక్మిణి మొగమున తెచ్చికోలు సంతోషమున్నది; లక్ష్మీదేవికి ప్రతినిధి; శ్రీకృష్ణుని దేవేరియుగదా! ఆమెకు ఔదార్య మెవరు నేర్పవలెను?

సత్యయా తనసౌధమునకు వచ్చి, వ్రతమునకు రమ్మని పిలిచినది; వ్రతమా, ఉత్తమమైనది; సర్వభార్యా సమానుని ఒక్క సత్యమాత్రమే ధార వోయుట విచిత్రమే! ఈర్ష్యా స్థానమే! కాని తాను పట్టమహిషి; నిండుకొని యుండవలయును; వ్రతమునకుఁ బోవనిచో నసూయ వెల్లడికాఁగలదు; అచ్చట ప్రవర్తిల్లిన విశేషములు కనులార గాంచుటయుఁ దటస్థింపదు. ఈయీకారణముల రుక్మిణి తన పెద్దఱికమును నిలఁబెట్టుకొనుటయే యుత్తమ మనుకొనెను.

ఇందు రుక్మిణి చూపినది ఔదార్య మను గొప్పగుణము. నిరపరాధయర్య తన్ను నిర్వాసిత నొనరించినపుడు సీతాసాధ్వి, రామునియెడఁ జూపిన యౌదాగ్య

మునే రుక్మిణియు నిచ్చటఁ జూపినది. అందుచే "రాఘవత్వేఽ భవ త్సీతా రుక్మిణీ కృష్ణ జన్మని, అన్యేషు చావతారేషు విష్ణోరేషానపాయినీ"—అను నభియుక్తోక్తి యుక్తియుక్తము.

## 25

మేళవించినవి సుమ్మీ దీనిమె ట్లని
మాంసలాంసంబున మహతిఁ జేర్చి
మిన్నేటిజలము సుమ్మీ తొలంకెడు నను
డాచేత మణికమండలు వొసంగి
యిది జపోచితము సుమ్మీ జతనం బని
వలచేతఁ బద్మాక్షవలయ మిచ్చి
యీశానుఁ డిచ్చెఁ జుమ్మీ మాకు నిది యని
శార్దూలచర్మంబుఁ జంకఁ జొనిపి
పొమ్ము పొ మ్మని యెకకొంత పోవఁబోవ
రమ్ము రమ్మని మఱలఁ జేరంగఁ బిలిచి
కపట నటనాపరుండైన కంసవైరిఁ
బరమముని నవ్వుటాలకుఁ బనులుగొనియె.

(పారి 5-86)

సత్య తన ప్రాణనాథుని నారదునకు ధారపోసినది. నారదుఁడు కృష్ణుని పనులు గొనుట యిందు వర్ణితము :

"స్వరానుకూలముగ వీణ నాయత్తము చేసితిని ; నీవు మోసికొని తెచ్చుటలో మెట్లు స్థానము తప్పును జుమా ! జాగ్రత్త ; ఈ కమండలువులో ఆకాశగంగాసలిల మున్నది ; నీవు ఎడమచేతితో పట్టుకొని తెచ్చుటలో తొణఁకును జుమా, జాగ్రత్త ! నీ కుడిచేతి కిచ్చినది తామరపూసలదండ ; జపమునకు యోగ్యము సుమీ ! యిది జాగ్రత్త. నీ చంకకు అందించినది పులితోలు ; దీనిని నా కీశ్వరుఁ డిచ్చెనుజుమీ, జాగ్రత్త ! ఇటు రమ్ము ; ఇటురమ్ము ; అటు పొమ్ము ? అటు పొమ్ము". అని నారదుఁడు కృత్రిమ వర్తనా సక్తుఁడగు గోపాలునిచే సేవలు గొనెను.

నారదుఁడు రమ్మనఁగా, కృష్ణుడు సేవకునివలె వచ్చెను ; పొమ్మనెడ పోయెను. ఇది కపట నటనకు నిదర్శనము. యావత్ ప్రబంధవస్తువు నిందు ధ్వనితము. నారదుఁడు తన వస్తువులను శ్రీ కృష్ణుని అవయవములకు సోఁకించుటలో

అవి పవిత్రములు కాఁగలవని విశ్వసించుట కలదు. ఆయావస్తు స్పర్శమున తాను పవిత్రుఁడు కాఁగోరుట యున్నది. ఈ పద్యమందలి హాస్యరసము పరిమృదువు; రాయలను రంజింపఁజేసి యుండును.

## 26

ఇచ్చి కయికొనియెఁ గ్రమ్మఱ
నచ్చిగురుంబోఁడి విభుని ; నావైభవమున్
మెచ్చి కురియించి రపుడు వి
యచ్చరు లచ్చెరువుగాఁగ నలరులవానల్

(పారి 5-89)

సత్యభామ నారదునివలన తన ప్రాణనాథుని తిరిగి కైకొనెను. ఆమె వైభవమునకు మెచ్చి దేవతలు పుష్పవర్షము కురిపించిరి. అలీలామానుషవిగ్రహుఁ డయ్యును లీలా మానుష విగ్రహుఁడైన శ్రీ కృష్ణపరమాత్మని దాస్యవిముక్తికిఁగూడ దేవత లానందించుట యుక్తమే.

శ్రీకృష్ణుఁ డాపిదప పదాఱువేవురైన భార్యలతో సౌఖ్యాంబునిధి నోలలాడెను ఈ కథ వినిన శ్రీ కృష్ణరాయలును భార్యలతో సుఖజీవితము గడపెను.

## 27

ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవినికర గుంభిత కావ్య
స్మృతిరోమాంచ విశంకిత
చతురాంతఃపురవధూ ప్రసాదనరసికా !

(పారి 1-139)

చిత్రబంధాదికవిత్వములు చెప్పఁగల నందివారి తిమ్మనకు, ఘంట సింగన మేనల్లునకు, నంది మల్లన వంశ్యునకు గ్రుక్క త్రిప్పకుండ ఒకే సమాసములో పద్యమును కూర్చుట కష్టముగాదు. ఆతఁ డుమామహేశ్వర వర ప్రసాద లబ్ధ సార సారస్వతాబ్ధి నంది. ఆతని మధుర గంభీరకవిత వ్యంగ్యసుగంధి.

[illegible] ప్రతి సంవత్సరమును కృష్ణరాయలు వసంతోత్సవములు జరిపెడివాఁడు. ఆ [illegible]లో పాల్గొనుటకై సుకవు లనేకులు విజయనగరము వచ్చెడివారు. వారివారి [illegible]స్త కావ్యముల స్వారస్య చింతాతత్పరుఁడగుచు నాశ్చర్యానందములచే నప్పుడప్పు డంతఃపురములలో రాయలు రోమాంచితగాత్రుఁడగు నన్నమాట. ఆతని గగుర్పాటును పరనారీ స్మరణ జన్యమని భ్రమించి అంతఃపురాంగనలు అనుమానించుచుండుట

యొక యాచారము. రసికురాంౘ్రడగు ఆ యంతఃపురస్త్రీలను ప్రసన్నలఁగా జేసికొనుట యందు నేర్పుగలవాఁడఁట, రాయలు.

ఈ పద్యమువలన రాయల కవిపండితపోషణయు, కావ్యానుశీలనాభ్యాసరాసిక్యమును, 'పారిజాతాపహరణ' కథలోని వస్తుధ్వనియు వ్యక్తము లగుచున్నవి. సత్య పొందిన యీర్ష్యామానముగల ప్రథమాశ్వాసకథ యంతయు, లేదా- యావత్ ప్రబంధ కథయు నిందు ధ్వనితము. ఆశ్వాసాంత పద్యములు కేవలము కృతిపతి ప్రశంసా పూర్వకములు, ఐనను నిట్టి వ్యంగ్యస్ఫూర్తి వానిలో నొదిగివచ్చినపుడు సహృదయుల చిత్తములు చమత్కృతములు గాకపోవు. శ్రీకృష్ణకృత సత్యానునయ కథాసర్వస్వ మేరీతిగ నిందు వ్యజ్యమానమో, కృష్ణరాయకృత తిరుమలదేవ్యానునయము సర్వము కూడ నదే రీతిగ నిందు వ్యజ్యమానము. ఆ యనునయముకూడ తన యీ మహా ప్రబంధమువలననే జరిగినట్లును, ఇది వసంతోత్సవ సందర్భమున స్పష్టమైన దనినట్లును మహాకవి నిపుణముగ నీ పద్యములో సూచించినాడు, రాయలకాలముననేగాక, ప్రాచీన కాలమునుండియు నీ 'వసంతోత్సవము' లున్నట్లు సంస్కృతకావ్యాదుల సాక్ష్యమువలన విదితము.

అనేక ప్రమాణములచే నీ 'పారిజాతాపహరణ' మహా ప్రబంధము క్రీ. శ. 1516-'17 నాఁటి వసంతోత్సవములలో రాయల కంకిత మీయఁబడిన దని మన మూహింపవచ్చును.

ఈ పద్యము ప్రత్యక్షర మధురము. అల్పాక్షరములలో అనల్పమైన భావ మిమిడియుండి యర్థసంగ్రహత కీపద్యము నిదర్శన మగుచున్నది. సాధారణకవులకు సమాసములు ఇసుకలో బొంగరమువలె బరువుగ నిట్లు గిఱ్ఱున నిన్ని చుట్లుచుట్టుగ తిరిగి రాదు.. చుట్టులువడుటయేగాదు ; కమ్మచ్చునందు బంగారుతీగవలె నీతని పద్యము సాగుటయు కలదు.

> "తలిరాకుఁబోఁడి యొక్కతి
> జలకమునకు వేళ యనుచు శౌరికి వీణా
> కలకలములఁ గలకలనగు
> పలుకుల మేలపొలయ విన్నపము గావించెన్" ( పారి 2-5 )

స్థూలముగ నాశ్వాసాద్యంత పద్యములలో తిమ్మనార్యుని వ్యాకరణపాండిత్య మెంత వ్యక్తమయ్యెనో, ప్రథమాశ్వాసమునం దంతటను విప్రలంభశృంగారచిత్రణ సామర్థ్య మంత వ్యక్త మయ్యెను. ద్వితీయాశ్వాస మంతయు భాషాపాండితికిని. ఊహా వైభవమునకును అభిదాంతర మగుట చూడఁగలము.





తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషిచేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసుల్లో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమ సాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

NEW VISTAS PRINTERS, Kachiguda Chowrasta, Hyd-27.